# ఆర్యసమాజము - సిద్ధాంతములు

వినరయ్య విజ్ఞులారా! వేదాంత సారంబు వివరింతునూ
సత్యమెఱిగియు మీరలూ శాశ్వతానందమయులై వెల్గుడీ ॥విన॥

నిత్యవస్తువులు మూడూ-అవి సదా సత్యమై పరగుచుండూ
ఈశజీవప్రకృతులూ అనబడుచు నెల్లపుడు ప్రబలియుండూ ॥విన॥

ఈశ్వరుడు వ్యాపకుండై యుండునూ జీవుండు వ్యాప్యుడౌనూ
జీవుడీశ్వరు లెపుడును చేతన తత్త్వంబులైయున్నవీ ॥విన॥

ఈశ్వరుని తత్త్వమరయా విశ్వంబు నంతటా నిండియుండీ
సృష్టిస్థితిలయ మూలనూ చేయునూ సచ్చిదానందుడతడూ ॥విన॥

జీవులెన్నియొ యున్నవీ సృష్టిలో నణువుకంటే చిన్నవై
ప్రకృతితత్త్వంబెఱుగగా సూక్ష్మమై జడముగా దానున్నదీ ॥విన॥

సూక్ష్మరూపమున నున్నా ప్రకృతినీ స్థూలరూపము చేయుచూ
ఈశ్వరుడుసృజియించునూ లోకములజీవులకు భోగార్థమై ॥విన॥

కర్మముల చేయుటందూ జీవుండు స్వాతంత్ర్యతన్ పొందునూ
కర్మఫలమనుభవింపా తానెపుడుఅస్వతంత్రుడు మాత్రమే ॥విన॥

కర్మానుసారంబుగా ఈశ్వరుడు జీవులకు దేహమిచ్చూ
కర్మఫలముల నన్నిటీ వానిచే ననుభవింపగజేయునూ ॥విన॥

సత్కర్మ లాచరింపా జీవులకు సుఖశాంతు లొసగుచుండూ
దుష్కర్మ లొనరించుచో వానినీ దుఃఖభాగులజేయునూ ॥విన॥

తనవారు పెఱవారనీ భేదంబు అణుమాత్రమెంచకెపుడూ
న్యాయకారితదృష్టితో లోకముల పాలించుపరమేశుడూ ॥విన॥

యమనియమ ఆసనాదీ అష్టాంగ యోగమున చరియింపుడీ
పరమేశుకృపచేతనూ పొందెదరు నిశ్శ్రేయసానందమున్ ॥విన॥

— వెంకయార్య



# ఆర్యావర్తవాణి

రచయిత:

సాధు వాస్వాని

అనుకర్త:

డాక్టర్ పండిత గోపదేవ్ (దార్శనికులు)

ఆర్యసమాజము - కూచిపూడి

ఆంబాదర్శన గ్రంథమాల-59

ప్రతులు-1000

వెల : 2-50

ప్రభవ - జ్యేష్ఠము
జూన్-1987



ప్రకాశకులు :
ఆర్యసమాజము-కూచిపూడి-522 313

ముద్రణ : విజయ ఆర్ట్సు ప్రెస్ - తెనాలి.

# సంపాదకీయము

శ్రీ పండిత గోపదేవ్‌గారు నలువది సంవత్సరములకు పూర్వము ఉత్తరప్రాంతమునుండి కూచిపూడివచ్చి మౌనముగా నుండు రోజులలో శ్రీ వడ్లమూడి వెంకటరత్నంగారి ప్రోద్బల ముచే వ్రాయబడినట్టి దీపోత్తము. వ్రాతప్రతిని జూచినచో నక్షరములుకాని భాషకాని వారి రచనకు సంబంధించినదిగా గానరాదు. వారు వ్రాసినట్టి తరువాతి గ్రంథములను మీరు చదివిచూచియుందురు. ఇప్పుడు దీనిని చదివిచూడుడు. వానికి దీనికి భావప్రకటనలో భాషాపటిమలో నున్న తారతమ్యమును తేలికగా గ్రహింపగలరు. బహుకాలము ఉత్తరదేశముననుండి తెలుగు భాషించుటయే లేనికారణమున మొదటిసారిగా వ్రాయ దలపెట్టిన యీ రచనలో వారి యశక్తత వెల్లడికాగలదు. వ్రాయగా వ్రాయగా చేయి యెంతపదునెక్కినదికూడ మీరు గ్రహింపకపోరు.

వారి వ్రాతప్రతులు తిరుగవేయుచుండ 'ఆర్యావర్తవాణి' అనుపేరుతో నియ్యది లభించినది. ఇందలి భాష భావప్రస్ఫుట నము తరువాతి రచనలతో బోల్చినచో బాగుగా లేకున్నను, వైదిక సాహిత్యమునకు సంబంధించిన పెక్కు గ్రంథములు ప్రచురించి యుండుటచేతను, ఆర్యసమాజస్థాపకుడైనట్టియు, వైదిక ధర్మప్రచారమునకై ప్రాణములర్పించిన మహామహుడు శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజక మహర్షి దయానంద సరస్వతిని గూర్చి యువకులలో ప్రబోధము గలిగింప చేయబడిన ప్రయ త్నము కావుట యువకులకత్యంతావశ్యకముగా భావించి దీనిని ముద్రింపించితిమి. ఇందు మహాపురుషుల జీవితము నాదర్శ ముగా గ్రహించినచో మానవజాతి వీర్యవంతమై దేశస్వాతంత్ర్య

మునకు పాటుపడుటకు శక్తిమంతము కావలయునని మనదేశ మునకు స్వాతంత్ర్యము రాకపూర్వము దయానందుని జీవితము నాదర్శముగా జూపుచు యువకులకు ప్రబోధముకలిగించుటకు వ్రాయబడిన గ్రంథము. ప్రతిదేశమునందును మహాపురుషుల జీవితగాథల నాదర్శముగా జూపుటకు వారివారి జన్మదినోత్సవ సందర్భములో వారి జీవితవిశేషములు ఉత్తమగుణములను ప్రస్తుతించి యువకులను ప్రోత్సహింతురు. అట్లే యీ గ్రంథ ముద్వారా దేశస్వాతంత్ర్యముకొఱకు బానిసత్వమును బాఱ ద్రోలుటకు యువకులకు శ్రీ మద్దయానందుని ఆదర్శముగా జూపి వారిలోని శారీరిక మానసికశక్తి, బ్రహ్మచర్యము, కార్య దీక్షా దక్షత, ధ్యేయప్రాప్తికి ప్రాణార్పణమునకైనను సిద్ధమగుట మొదలగునవి బోధింపబడినవి. ఇప్పుడు మనము స్వతంత్రు లముగదా యని దేశసౌభాగ్యమును గూర్చి పరికింపక, తోటి మానవ కల్యాణప్రాప్తికి పాటుపడక సోమరులై, అవినీతిపరులై, కఠినహృదయులై, స్వార్థపరులై, అజ్ఞులై, అంధానుకరణము చేయువారికిది కర్తవ్యప్రేరణలో ప్రబోధగీతము వంటిదగును.

శ్రీ పండిత గోపదేవ్‌గారి రచనలను చదువ నలవాటు పడిన సోదరులు ఈ రచనలోని విలక్షణమువలన నశ్రద్ధచూపక విషయమునకు ప్రాధాన్యమిచ్చి చదివి యొకొక్కరొక్కక దయానందుడుగా తయారు కావలయునని యాశింతును.

— వెంకయార్య



!

# అనువాదకుని మాటలు

ఈ మధ్య ఒకటి రెండేండ్లనుంచి మౌనముద్ర వహించి కాలుచేయి కదపకుండా కూర్చోవాలని నాకొక సుబుద్ధో-దుర్బుద్ధో యేర్పడినది. అట్లా కాలంగడుపుతూ ఉండగా ఒకనాడు నా మాననీయ మిత్రులలో నొకరైన శ్రీ. వ. వెంకటరత్నంగారు నన్ను చూడాలనే ప్రేమతో నేనున్నచోటికి వచ్చిరి. ఇష్టాగోష్ఠిలో కొంతసేపు గడచిన తరువాత "ఊరికే కాలంగడుపుతూ ఉన్నావేం? ఆర్యసాహిత్యానికి సంబంధించిన చిన్నచిన్న పుస్తకాలేమైన వ్రాయరాదా? లేకపోతే ఆర్యాదర్శాలను వెల్లడించే చిన్న పుస్తకాలను అనువదించరాదా?" అన్నారు. ఆమాటలు నా మనసులో ఆదేశాలవలె పనిచేసినవి.

ఒకరోజున నాచిన్న 'లైబ్రరీ'ని "తెరచి పుస్తకాలు తిరగేస్తూ వుండగా ఒక చిన్నపుస్తకం నాకంటబడింది. దానిపేరు." **"The Voice of Aryavarta"** దానిని రచించిన మహానుభావుడు **T. L. Vaswani** వీరంటే నాకెంతో శ్రద్ధాభక్తి. నేను ఉత్తరభారతమున నున్న రోజులలో వీరినొకటి రెండుమారులు చూచిఉంటిని. వీరి ఉపన్యాసాలుకూడ విన్నాను. వీరు ఆజన్మ బ్రహ్మచారులు, విద్యాసంపన్నులు, సదాచారప్రాణులు, త్యాగశీలురు-వీరి మృదుమధుర-భాషణలకు వినడానికి ఇంగ్లీషు వాళ్లుకూడ చెవికోసుకుంటారు. మన యువకులమాట చెప్ప

నేల? యువకుల కర్తవ్యాన్ని బోధించటంలో వాస్వానిగారు పేరెన్నికగన్న వారిలో ఒకరు. ఆ వుద్దేశంతోనే వారీపుస్తకాన్ని రచించారు? ఈ చిన్నపుస్తకంలో దయానందుడు భారత నవ యువకులకు ఏవిధంగా ఆదర్శపురుషులో చక్కగా వర్ణించారు. ఇందు ప్రదర్శింపబడిన భావాలు నాకు చాలా సత్యపూర్ణంగాను దేశహితకరంగాను, యువకుల కనుసరింపదగ్గవిగాను కనిపించాయి. నామిత్రుల యాదేశం నన్నీపుస్తకాన్ని తెలుగురూపంలో తెలుగుదేశ యువకుల కందజేయ ప్రేరేపించినది. నేను వెనకా ముందు జూడకుండా, పుస్తకం వ్రాసేశక్తి ఉందాలేదాయని విచారించకుండానే, నాచేతనైనట్లు వ్రాసి సుహృదులగు పాఠకుల చేతులలో నుంచుతున్నాను. దీని ప్రయోజనం కాల గర్భితం.

— గోపదేవ్.



# ఆర్యావర్త వాణి

## (సాధు వాస్వానిగారి మొదటిమాటలు)

యువకుల బలాత్కారమునకు వశుడనై యీ చిన్నపుస్తకమును వారికొఱకై రానున్న దయానందమహర్షి యొక్క జన్మశతాబ్దికొఱకు రచించితిని. వారియుత్సాహము మనోహరము. పరమాత్ముడు నా హృదయమును యువకులతో సంబద్ధ మొనర్చెను.

భారతసేవ కుపకరించు 'ఆధ్యాత్మిక వీరసమాజము' నా జీవనస్వప్నము. ఈ సమాజమున బ్రహ్మచారులగు యువకులు సదస్యులగుదురు. అఖండ బ్రహ్మచారి - తపస్వియు నగు దయానందుడిట్టి సమాజమునకు సహజముగా పథప్రదర్శకుడు కాదా?

వీరపూజ రాష్ట్రీయజీవనమున జాగృతి నుద్భవింపజేయును. జపానులో విద్యార్థులు ప్రతివర్షము మందిరములందు వీరపూజలు సలుపుదురు. ఆ వీరులు మృతులుగా నెంచబడక సజీవులై నేటికిని రాష్ట్రమున కార్యభారము వహించుచున్నట్లెంచబడుదురు. సంన్యాసి, జ్ఞానమూర్తి, పరమ తపస్వియునగు దయానందుడు మనరాష్ట్ర జీవనమునకు సహయోగియయ్యెను. అందువలన మనమతనిని నవభారత నిర్మాత, ఇతిహాస నాయకుడునని యెంతుము.

వర్తమాన భారతవర్షపు ధర్మాచార్యులలో దయానందుడు శక్తిశాలి యగు నార్యావర్త వాణియై యుండెను. అతని జీవనమునను, ఉపదేశములందును నేటి తరుణ భారతమున కావశ్యకమగు సందేశము విరాజిల్లుచున్నది.

దయానందుని సందేశము ఆత్మవిశ్వాసము. యువకులారా! మీరు మీయాత్మీయ కేంద్రములనుండి కార్యశీలురగుదురు గాక. అందులకై భారతవర్షమును నొకసమయమున రాష్ట్రనేతగా నొనర్చిన యాదర్శముల నెఱుంగుడు.

ప్రాచీన భారతవర్షముకంటె నుత్తమ నవీనమర్యాదలను స్థాపింప నెంతురేని మీరు మీ ఆత్మీయ కేంద్రములతో కార్యముల నాచరింపుడు.

దయానందమహర్షిలో నగ్న్యంశ మున్నదని యెంచెద. ఆ యగ్నియు నప్రాకృతము అధ్యాత్మికము. ఆ యగ్ని దేశమున నానాప్రాంతమునగల యువకులైన బ్రహ్మచారులలో వ్యాపించినపుడు భారతము తన స్వప్నమును ప్రత్యక్ష కార్యరూపమున జూచు సౌభాగ్యదినము లరుదెంచును.

నేనీ చిన్నపాత్తమును కొండొక వేదమంత్రమున నుల్లేఖించిన మహత్త్వాకాంక్షతో ప్రేమపూర్ణశుభేచ్ఛలతోను రాష్ట్రీయ నవయువకుల సమక్షమున నుంచుచున్నాడ-

మంత్రభావమిది :- జుగుప్సనుండి తొలగించి స్వాధీనతను నేకతను లభింపజేయుము. అర్యులారా! గోవు వత్సను ప్రేమించునట్లు పరస్పరము ప్రేమించుడు.

# మేలుకొనుడు

అతడవతరించి యొకశతాబ్దము గతించినది. 'కాఠియవాడ్'లో టంకారానామక గ్రామమునందు, క్రీ. శ. ౧౮౨౪ న నతడు జన్మించెను. సం. ౧౮౮౩ న అజమీర్ నందతనిదేహమవసించినది.

౨౩ వర్షముల ప్రాయమున నతడు సంపన్న పితృగృహమును త్యజించును. అతని హృదయమున జ్ఞానజ్యోతి ప్రకాశించెను. అందువలననే యతనికవశ్యము సత్యాన్వేషణ మొనర్పవలసి యుండెను. అతనికి మొట్టమొదట ౧౪ వర్షముల బాలప్రాయముననే జ్ఞానము కలిగినది. అతనితండ్రి యతనిని శివమందిరమునకు గొంపోవును. రాత్రి సంపూర్ణ జాగరణము జేయ నాదేశించును. అతడు రాత్రియందు పూర్ణజాగరణ జేయును. అర్చకులందరొక్కరొక్కరుగా నిద్రింతురు. రాత్రి ౧౨ గంటలగునప్పటికి తండ్రియు నిద్రావశుడగును. అతడొక్కడే మేల్కొనును. ఆ యేకాంత నిశీథసమయమున దివ్యజ్యోతి యతని యాత్మను స్పర్శించును. ఒక్క చిట్టెలుక శివమూర్తిపై చిందులాడుట నతడు చూచును. ఆ బాలకుడు, పవిత్ర సత్యప్రేమి, తనలో తాననుకొనును.

"ఈ మహాదేవుడే ప్రపంచ రక్షకుడా?"

అతనితండ్రి అంబాశంకరుడు బాలునిధార్ష్ట్యము పై కుపితుడగును. కాని యతనియాత్మ మాత్రము జాగృతినిబొందినది. తల్లిదండ్రులతని వివాహమొనర్ప యత్నింతురు. అతడో సత్యమును సేవించుటకు నందులకై జీవనముల నర్పించుట

కును దృఢసంకల్పుడగును. వివాహ బంధనము లతనికి జుగుప్సావహములు. అందువలన గృహమువిడిచి పలాయితు డగును, తండ్రి యతని నొకమందిరమున పట్టుకొనును. క్రోధ ముతో నంబాశంకరుడు పుత్రుని గద్దించును. "అరే! నీవు కుల మును అచంద్రార్కము కలంక మొనర్చితివి" అని తనపుత్రుని భాగ్యమున నొక దేదీప్యమానజ్యోతి ప్రకాశింపనున్నదని (కర్ష న్‌జీ) యంబాశంకరుడెరుగడు.

దయానందుడు మరల పలాయితుడగును. అతడు దూరదేశములందుగల కాశ్మీర్-తిబ్బత్ ప్రభృతి రాజ్యములందు భ్రమించును. వాస్తవమున జ్ఞానమరణ్య యాత్రికులకే లభిం చును,

దయానందుడు ౧౨ - ౧౩ వర్షము లన్వేషణమున నయించును. తరువాత విరజానందస్వామిని దర్శించును. 2½ సంవత్సరములట స్వామియంతికమున విద్యాధ్యయన మొన ర్చును. ఇవి యభ్యాస దినములు. తపస్యాసమయము, తరు వాత గురువు అతనిని ఆదేశించును.

"దయానందా! ప్రపంచమధ్యమునకు బొమ్ము. మనుష్య జాతియందు జ్ఞానప్రసార మొనర్పుము."

గురుసందేశమును పొంది దయానందుడు కార్యక్షేత్ర మున నవతీర్ణుడగును. రజతసువర్ణములనుండి విముఖుడగును. జ్ఞానము తపస్యయు నతనికి ధనము. ఆ ధనబలముననే ఆర్య సమాజప్రవర్తకుడు రాష్ట్రనిర్మాతయు నగును.

అతడొక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు 'మేలుకొనుడు - మేలుకొనుడు'. అనుశక్తిపూర్ణసందేశమును గొంపోవును. ఈ సందేశహరణము నిర్హేతుకముగాదు. జనులు ప్రాచీన పైతృక-అధికారములను మఱచిరి. శిక్షితవర్గములందు సంశయవాదమావరించినది. సాధారణజనులు అంధవిశ్వాసము (Superstition)న బడియుండిరి. రాష్ట్రమునందంతట నార్య ధర్మము లజ్ఞానవశమున నవహేలన చేయబడుచుండెను. హరి ద్వారమున 'కుంభమేలా' సమయమందు దయానందు డున్న చోట పాషండఖండన పతాకమెగురుచుండెను. అదియే యతని జీవనమునకు ముఖ్యచిహ్నమై యుండెను. అతనియాత్మ, లోక మున ధర్మనెపమున జేయబడు నసత్యవ్యవహారములకు విరు ద్ధముగా విద్రోహమొనర్చును.

సమస్త వీరపురుషులయొక్క ప్రథమవిశేషత, గంభీర మును మహత్త్వపూర్ణమునగు సత్యమని కార్లాయిల్ చెప్పిన దెంతయు సముచితము. దయానందునిలో నీ విశేషత వీరతా రూపమున నుండెను. సత్యమునందుగల ప్రేమచే నతడు రాజులనుగాని పురోహితులనుగాని యెవరిని లెక్కచేయడు. సత్యప్రేమచే నతడు దుఃఖముల నెదుర్కొనును. పలువురతని తో నప్రసన్నులయిరి. అనేకులతనిని నాస్తికుడని చాటిరి. తుద కతనిప్రాణములు దీయుటకును కొందఱు కుట్రలబన్నిరి. ఉదయపురనరేశునిచే నామంత్రితుడై దయానందు డుదయపుర మునజేరును. అట నంధవిశ్వాసములకు విరుద్ధముగా నుపదే శించును. ఉదయపుర మహారాజు, ఏకలింగమందిరముయొక్క మహంతు గద్దీపై అభిషిక్తుని జేయుదునని యాసగొలుపును. ఈమందిరముయొక్క వార్షికాదాయమొక లక్షరూపాయలకుం

డును. దీనికి బదులుగా దయానందుడు వర్తమాన సనాతన ధర్మమును మూర్తిపూజను ఖండించకుండునట్లు కోరబడెను. దయానందు డదివిని నరేశునితో నిట్లనును.

"రాజన్! నేను సత్యప్రచారకుడను".

ఉదయపురమునుండి శాహపురము వెళ్లును. అటనుండి జోధపురమహారాజతని నామంత్రించును. దయానందుడు జోధపురమున కొంతకాలముండి శాసకశాసితులలో నవీనజీవనమును సంచరింపజేయ యత్నించును. అయిదవనెలలోనే రాజకర్మచారులతనికి విరుద్ధముగ కుట్రచేయుదురు. రాజ సంస్కారమును నిమిత్తముగా గొని యాకర్మచారులొక రాజ వేశ్యను పురికొల్పిరి. కొలది దినములకు తరువాత దయానందునకు శైత్యబాధగలుగును. అతడాహారము విడిచి దుగ్ధ పానము మాత్రము జేయును. దుగ్ధమున విషముగలుపబడును. అతని పాచకుడగు జగన్నాధుడను బ్రాహ్మణునకు లంచమీయబడును. దయానందుడు జగన్నాధుని క్షమించుటయేగాక ద్రవ్యమిచ్చి నేపాలుపంపి ప్రాణములగాపాడును. దయానందుని స్వాస్థ్యము ప్రతిదినము చెడనారంభించును. జోధపురము నుండి ఆబూ వెళ్ల నిశ్చయించును. ఖిన్నహృదయుడగు జోధపురనరేశుడు స్వామి పాలకీవెంట కొంతదూరము కాలినడకను వెంబడించును. ఆబూ పర్వతమున దయానందునకు కొంత యారామ మేర్పడును. కాని డాక్టరులు అజమీరు వెళ్లుటకై బలవంతము చేయుదురు.

అక్టోబరు 30వ తారీకున దయానందు డజమీరులో మృత్యుశయ్య నధిగమించును. హకీమ్ పీర్ ఇమామ్అలీ,

డాక్టర్ న్యూటన్ దయానందుని పరీక్షించుటకై పిలువబడిరి. అతని ప్రముఖశిష్యులు ననేకులువచ్చి శయ్యాసమీపమున నిలువబడిరి. దయానందుడు మీరేమి కోరుచున్నారని యడుగును. "స్వామీ మీరు త్వరగా స్వస్థులగుదురుగాకని పరమేశ్వరుని ప్రార్థించుచున్నామ'ని వారు నుడువుదురు. దయానందుడు దానికి బదులుగా "ఇది కేవలము శరీరము. ఇది యింతకంటె నేమి బాగగును" అని చెప్పును.

సాయంకాలము 5½ గంటల సమయమయినది. దయానందుడు తిథియు పక్షమును తెలిసికొనును. పైవంక జూచుచు వేదమంత్రముల పఠించుచు గాయత్రి నుచ్చరించును. కొన్ని నిమేషములూ సమాధిస్థుడై యుండి కన్నులు తెఱచును. "హే దయాలో భగవన్! నీయిచ్ఛ పూర్ణమగుగాక" అని యంతిమవారము శ్వాసించును.

ఇది దీపావలి పర్వదినము. భారతీయులు ప్రకాశముతో నీ పవిత్రపర్వమును జరుపుదురు. ఈపర్వము లక్ష్మీసరస్వతులకు ప్రియకరము. సరస్వతీప్రియ పుత్రుడు దయానందుడు దీపావలి దినముననే బ్రహ్మలోకమునకు ప్రస్థితుడగును. దయానందుడు గీతావర్ణిత జ్ఞానయజ్ఞముచే శాశ్వతబ్రహ్మ నారాధించెను.

'నీవు నిన్నెఱుగుము' ఇది సుకరాతుని(సోక్రటీస్) మహాసందేశము. అతనికి ప్రాచీన యూనాన్ ధర్మమున విశ్వాసము లేకుండెను. అతడు కేవలమొక పరమేశ్వరునందు విశ్వాసముంచెను. అందు కతనికి మృత్యుదండన విధింపబడెను. అతడు

ప్రసన్నతతో విషము (Hem bock) ను ద్రావెను. శాంతితో ప్రస్థానమొనర్చెను.

'మీ ప్రాచీనవిద్యల నెఱుగుడు' ఇది దయానందుని మహత్సం దేశము. అతడు నొకేపరమేశ్వరుని విశ్వసించెను. అతనికి విషమీయబడెను. అతడందఱిని క్షమించెను. శాంతి పూర్వకముగా దేహమునువిడిచి ప్రస్థితుడయ్యెను.

'ఉత్తిష్ఠత జాగ్రత. లెండు, మేలుకొనుడు' ఇది సుందరమైన ప్రాచీనసూక్తి, దయానందుని జీవనమునకిది ముఖ్యోద్దేశమై యుండెను. ఈ ప్రాచీనమును, చిరపీడితమును నగు నీ రాష్ట్రము నిట్లు దయానందుడు సంబోధించెను.

"పూర్వర్షుల సంతానములారా! మీరు నిద్రితులయి బహుకాలము గతించినది. ఇది మేల్కొను సమయము, మేల్కొనుడు.

## నీ యాత్మీయ కేంద్రము

ఆ మనుష్యునిలో నెట్టి విలక్షణశక్తి యుండెను! అతడు బహుదూరము యాత్ర నొనరించెను. భారతమున నొకమూల నుండి మఱియొక కోణమువఱకు నార్యులయాదర్శము నుపదేశించెను. అతడు ముఖప్రీతి నెఱుగడు. అప్రియమైనను సత్యము నుపదేశించెను. అతని యాత్మబలమునకు జనుల మస్తకము స్వయముగా వినమ్రమయ్యెడిది. రాజులనేమి జనులనేమి భర్త్సన చేయుటలో నతడు వీరుడు-నిర్భీకుడు. మనుష్యులలో నట్టివాడు దయానందుడొక్కడే.

కొందఱాంగ్లేయులు దయానందుడు వర్తమాన భారతము యొక్క లూథర్ అని యతనిని సమ్మానింతురు. కాని దయానందుడతనికంటె మహాపురుషుడని నా విశ్వాసము. భారతవర్షము యొక్క యీ యాదిత్య బ్రహ్మచారి జీవనమును గౌరవాన్వితమును బహుమూల్యమునొనర్చినతపస్య-త్యాగమును లూథర్ జీవనమున నాకు గనిపింపవు.

దయానందుడు ఋషి - లూథర్ సంస్కర్త. ఇరువురును విద్వాంసులే. కాని దయానందుని వైమనష్యమున్నత స్థానము నలంకరించినది. దయానందుడు వేదవిద్య (Vedie Lore)యొక్క భ్రమణశీల విశ్వకోశమని(EancyClopedia) నా యభిప్రాయము.

నేను దయానందు నాచార్యునిగా నంగీకరించి యాదరింతును. ఈశబ్దమును కేవల వ్యావహారిక దృష్టితో నే నెన్నడును ప్రయోగింపను. శంకరుడు రామానుజుడు - మాధవుడు నాచార్యులే. వీరుముప్వురు మధ్య కాలీన భారతమున కాచార్యులు. దయానందుడు వర్తమాన భారతమున కాచార్యుడు.

ఎవని నాచార్యుడందురు? విచారమునందును ఆచారమునందును మహత్త్వము గలవాడు ఆచార్యుడు, ఆలోచించు శక్తిని విచారమనియు, ఆధ్యాత్మిక చారిత్రిక శక్తిని ఆచారమనియు నందురు. పాశ్చాత్య దేశమునపెద్ద పెద్ద విచారకులుద్భవించి యుండిరి కాని వారిలోనెందఱు దయానందునితో నాచారమున నుపమింపదగుదురు?

స్కోపెన్‌హేనర్ (Scopenhaner) గొప్ప సంస్కర్తల లోనొకడు. అతని కుపనిషదులలో నధికప్రేమ ఉండెడిది. అతని జీవితమును చదివినవారి కతడెంతయభిమానియైనదియు భృత్యుల విషయమున నతడెట్టి నీచమగు నసద్వ్యవహారమొన ర్చియుండినదియు సువిదితమై యుండును. అతడు తనజీవితము నుపనిషచ్ఛిక్షానుసారముగా నడుపజాలకపోయెను. అతనియాచారము విచారానుకూలముగా లేకుండెను.

నేనీ జర్మన్ విచారకుని విచారకుఁడందును. ఆచార్యుఁడని యంగీకరింపజాలను. దయానందుఁడు వైదికపండితుఁడేగాక, ఆధ్యాత్మిక సాధనసంపన్న ఆచార్యుఁడునై యుండెను.

అతఁడు దేశవాసుల నంధవిశ్వాసములందును. కురీతులందును, మౌర్ఖ్యబంధనములందును బంధింపబడి యుండుట జూచెను. దేశమాబంధముల నుండి విముక్తినొందగోరెను. నా యభిప్రాయమున దయానందుని ముఖ్యసందేశము రెండు విధములుగా నుండెను. భారతవర్షము తనశక్తుల నెఱుంగవలయునను నది మొదటివిధము. భారతము స్వతంత్రత ననుభవించుటకై ప్రయత్నశీల మగుటయు తనబలముపై తానాధారపడి పనిచేయ నేర్చుకొనుటయును రెండవవిధము. ప్రస్తుత నవయువకులు బేకన్, వనయన్‌మిల్, 'మిల్టన్'ల నుల్లేఖింతురు. ఈ యువకులలో నెందఱు కపిలవ్యాసశంకరుల నెఱుగుదురు?

మన విద్యార్థులు 'అరిస్టాటిల్'చే నిర్మించబడిన తర్కశాస్త్రమును జదువుదురు. కాని వారిలో నెందఱు వైదికులచే బౌద్ధులచే నిర్మింపబడిన న్యాయసూత్రములను షడ్దర్శము

లను జదువుచున్నారు? న్యాయశాస్త్రమున గౌతముడొక విఖ్యాత వ్యక్తియని యెందరెఱుగుదురు?

స్పెన్సర్ - హెగల్ పుస్తకములు చదువు విద్యార్థులెందఱు వైదికుల యాత్మవిద్య (Metaphysics) నెఱుగుదురు? పాశ్చాత్య పాఠ్యపుస్తకములను జదువువారిలో నెందఱు అచేతన మానసిక విజ్ఞానమును విశదపఱచుటకై పాతంజలయోగ దర్శనమును జదువుటకు యత్నించియుందురు? వర్తమాన శాసన విధానములను వితర్కించువారిలో నెందఱు ప్రాచీన భారత వర్షమునకు సంబంధించిన రాజనీతిని గాని, శాసన ప్రణాలినిగాని యాదర్శములనుగాని తెలిసికొన యత్నించిరి?

అక్సుఫర్డు సంస్కృత ప్రొఫెసర్ మెక్డోనల్ బోడెన్. రాయల్ ఏశియాటిక్ సొసైటీ (Royal Asiatic Society) యొక్క బొంబాయిశాఖకు సంబంధించిన స్వర్ణపతకమును గ్రహించుచు నిట్లు నుడివెను. "ఇది ఋగ్వేదము నాంగ్లేయ భాషలోను ఇతర భాషలలోను ననువదింపదగిన సమయము". కాని భారతీయులమైన మనము మనసంస్కృతిని, ఆదర్శములను, కలాకౌశలములను నేర్చుకొనుటకు వానిని రక్షించుటకు నేమి చేయుచున్నాము? భారత వర్షము మనహృదయములపై నధికారమును సంపాదించినదా? దయానందుడు భారతవాసులను హిందీ, సంస్కృతములను చదువ నుపదేశించెను. భారతవర్షము తన పుత్రపుత్రికల హృదయములపై నధికారము సంపాదింపనతడుకోరెను.

దయానందుడు భారతవర్షముపై పాశ్చాత్య శిక్షణాదులాక్రమించుట తెలిసికొనెను. భారతము, తనధర్మమును, తన

యాత్మను, జీవనమునకు సంబంధించిన గూఢ రహస్యములను పాశ్చాత్యదేశముల కర్పించుననుభయమతనికి కలిగెను. భారతవర్షము, తన స్వరూపమును గుర్తించవలెను. ఆస్వరూపము దివ్యజ్యోతిర్మయమై దయానందుని హృదయ పటలమున ప్రతిఫలించెను.

భారతీయ నవయువకులు తపస్యామార్గమున నడువ నేర్వనంతకాలము భారత వర్షమునకు స్వాధీనత లభింపనేరదని దయానందుని ధారణయై యుండెను. రాష్ట్రజీవన నిర్మాణమున కితరవస్తువులకంటె తపస్య యధికావశ్యకము. సఫలతను సంపాదించుశక్తి తపస్యయందున్నది.

ఒక జాపాని బాలిక తనదేశమునకు సేవజేయు నెంచెను. ఆ సమయమున రష్యా జపాను దేశముల మధ్య యుద్ధము జరుగుచుండెను. బాలిక నిర్ధన. కాని దేశసేవ చేయువలయు ననుకోరిక యుత్కటముగా నుండెను. తనచెంత దేశమున కర్పింపదగువస్తువేమైన నున్నదాయని యామె మనమున విచారించెను. ఆ బాలిక ప్రార్థనచేసెను. ఆమె హృదయమున సహసా ఆత్మోత్సర్గము చేయబుద్ధి జనించెను. రణక్షేత్రమున కేగి జపానుకొఱకు శత్రువులతో బోరాడుచు ప్రాణముల విడిచెను. ఆబాలిక మృత్యువును గూర్చి యిట్లాకాశవాణియయ్యెనని జాపానులు విశ్వసింతురు. "ఓ జాపాని నవబాలికా! నీవు ధన్యవు. నీవు నీ యాత్మోత్సర్గము ద్వారా నిజదేశవాసులను దేవతల పంక్తిలో కూర్చుండ యోగ్యుల నొనరించితివి."

ఈ ప్రసంగము మనకనుకరింప దగినది కాదా? దయా నందునిబోలు తపస్వులగు స్త్రీ పురుషులు ధన్యతములు. వారు భారతీయులను దేవపంక్తిలో గూర్చుండ యోగ్యులను చేయు చున్నారు.

యువకులారా! మీరు చిరకాల మామోదప్రమోదముల నోలలాడితిరి. జీవన సంబంధి యమూల్యగూఢ విశేషతల నుపేక్షాదృష్టినితిలకించితిరి. సుఖమును, సంపత్తిని, శక్తుల నన్వే షించుచు భారతవర్షమును చరణతలమున మట్టివైచితిరి. తపస్య నాచరింపుడు. ఆచారమునకు సంస్కరణకు నిదియే రహస్యము,



## తపోమందిరము

నగర నివాసులు నిద్రామగ్నులైయుండిరి. విద్యుత్ప్రి కాశమున ప్రతి వస్తువు పవిత్ర మౌనమునస్తబ్ధమైయున్న వేకువ యందీ వీధియందు నిలబడి యీ గానము చేయునదెవరు?

"జయజయ పితా పరమ ఆనందదాతా!" ఇది వారి గీత మున కనుపల్లవి. హా! నేడు పరమాత్ముని గుణానువాదమొనర్చు వారిసంఖ్య యతిన్యూనము. భారతవర్షము ప్రాచీనతను విడిచి యర్వాచీనపాఠమును చదువుచు తన యిష్టదేవుని క్రమముగా విస్మరించుచున్నది.

ఆదినమున పరమాత్ముని గుణానువాద మొనరించుటలో వారి యభిప్రాయమేమి? అది దయానందుని పుణ్యస్మారక దినము. మృత్యుశయ్యనుజేరి "పరమాత్మన్ తేరీ ఇచ్ఛాపూర్ణ హో ఓ3మ్ శాంతిః! శాంతిః! శాంతిః!" అని ప్రార్థన నొనరించు దయానందుని జనులు కనులార జూచిరి.

దయానందుని హృదయములో నొక దివ్యసందేశముం డెను. దయానందుడు తనసందేశము నొక సమాజమునకేగాక సమస్త ప్రపంచమున కొసంగెను.

ఈ దుఃఖమయ ప్రపంచమున మహావ్యక్తు లాయాసమయముల నెదుర్కొనిన కష్టములనే దయానందు డార్యసందేశమును మనవఱకు చేర్చుటలో పొందియున్నాడు. అరస్తూ నిర్వాసితుడయ్యెను. 'గైలీలీ' చెరసాల నుంచబడెను. దయానందునకు తీవ్రవేదన గలిగింపబడెను. కాని యతడు నిర్భయుడై యుండెను. ఎల్లస్థానములందార్య సందేశ దుందుభి ధ్వానమొనర్చుచు భ్రమణమొనర్చెను. నేటివఱకును మనలో ననేకులతని సందేశమునగల మూల్యము నెఱుంగరు.

నేనాసుదినమును ప్రతీక్షించుచున్నాడ. ఆ దినమున భారతమున విద్యాలయములందును కలాశాలలందును. విద్యార్థులు దయానందుని పవిత్రనామ గీతములను శ్రద్ధాసమన్వితులయి పాడుదురు. చీనా జపాన్ యూరప్ దేశములలో నతని నామము నుపాసింతురు.

భారత వర్షము యొక్క యావశ్యకత యత్యధికమై యుండెను. భారతముక్తి కనువగు దైవానుకంపము కొలది

వ్యక్తుల హృదయములందే పనిచేయుచుండెను. వారిలో దయానందు డొకడు.

అతడు భారతవర్షముకొఱకై మాతాపితరులను బంధు బాంధవులను పరిత్యజించెను. పైతృక ధనవైభవములను విడనాడి దారిద్ర్యముతో చుట్టరిక మాచరించెను. నిర్ధనులకు మిత్రుడు పశుపక్షులకు సఖుడునై మనకందఱికి వేదసందేశ మును ప్రాపింపజేసెను. దేశవాసులుదాసత్వబంధనముల చిక్కుకొనియుండుట నతడు చూచెను. కాని భారతవర్షము, దానిని బంధనములనుంచిన వారికంటె గొప్పదని యతని హార్దిక విశ్వాసము. కారణము భారతవాసులు ఋషి సంతానులగుటయే.

అతడు దేశమును నిర్ధనావస్థయందు గాంచెను. కాని భారతవర్షముయొక్క దారిద్ర్యము దానిప్రాచీనజ్ఞానము దానికి లభించినపుడే దూరమగునని యతని దృఢవిశ్వాసము.

అతని స్వకీయులే (దేశీయులే) యతనికి విరుద్ధముగా యుద్ధమాచరింప తలపడిరి.

దయానందుడు ధర్మాచార్యుడు కాకుండెనా? ప్రాపంచిక చరిత్రమున ధర్మాచార్యులకు పురోహితులకు మధ్య నెన్నడు యుద్ధములు జరిగియుండలేదా? ధర్మాచార్యులు పరమాత్ముని యోద్ధులు. దయానందుడు నొకయోధుడు. అతడనేక సమరముల నొనర్చెను. అతని మనస్సు ఎన్నడును చలింపదయ్యె. పాషండులతో నంధవిశ్వాసులతోజేసిన యుద్ధములకు ఫలము లభించినది. అతనికి విషమీయబడెను. అతడు విషదాత

కాశీర్వాద మొసంగి భయానక కాండమును సౌందర్యమున పరివర్తింపజేసెను.

దయానందుడు మృత్యువిజేత. శాంతిపాఠము నొనరించుచు నిహలోకము నుండి ప్రస్థాన మొనర్చెను.

ఒకానొక 'ఫారస్' దేశపురాజు అమరతా - పుష్పము (Flower of Immortality) నన్వేషించుచు గృహము నుండి బయలుదేరెను. తుదకు పర్వత కందరములలో నతని కాపుష్పము లభించెను.

దయానందుడు తన మనోరథపుష్పమును వేదములందు పొందెను. దయానందుని నీగురువెవరని యడుగగా నతడు తనగురువు వేదమని నుడివెను.

దయానందుడు ఋషుల సందేశమహత్త్వమును తెలిసికొనెను. ఋషులచే నిర్దిష్ట మార్గమునే మరలజూపెను. వేదమంత్రమీ విషయము నిట్లుపదేశించుచున్నది.

"య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం,
యస్య దేవా యస్యచ్ఛా యాఽమృతం యస్యమృత్యుః
కస్మైదేవాయ హవిషావిధేమ॥

అతడు ఆత్మదాత-బలదాత-అతనికి మనము హవిస్సునుపహార మొనర్చుచున్నాము.

దయానందుడు తనజీవితమును పరమాత్మునకు బలిగా నర్పించెను. ప్రతికార్య మతడు పరమాత్మోపాసనగా నెంచి

చేసెను. పరమాత్మునకు విశిష్టోపాయన మొనర్చుటకై యసత్యమునకు విరుద్ధముగా సంగర మొనర్చెను. దయానందుని జీవనము నిస్సందేహముగా తపమునకు త్యాగమునకు నిలయము-మందిరము.



## వేదముల వైపుకు మరలుము
## (Back to the Vedas)

భారత సమస్యను దయానందుడు చూచిన దృష్టితో మనలో చాలమంది చూడరైరి. సదాచారముతో స్వాధీనతా శక్తికి సంబంధమున్నది. రాష్ట్రముయొక్క యాంతరికశక్తిని మేల్కొల్పుట భారతీయ సమస్య. నేడీశక్తి యంతరించుచున్నది. హా! వైదేశిక వాతావరణమా! భారతీయప్రతిభ నెఱుంగని పద్ధతులకు మతములకు నింతవ్యాపకతా!

దయానందుడు వేదములవైపుకు నడువుడ'ని యుపదేశించెను. మిత్రులారా! శాసనవిధానమును మార్చినంతమాత్రమున చాలదు. మీలోగూడ మార్పురావలె. మీరు ముందుగా మీయులవాట్లను, పద్ధతులను, సంఘములను, జీవనమును మార్చుడు. వీని రూపపరివర్తనజేయుడు. భారతీయ ఆదర్శములయు, సంస్కృతియొక్కయు శిక్షణ మీకు మిక్కిలి యావశ్యకము.

దయానందు డితరవిషయములకంటె జాతీయజ్ఞానము, జాతి సంస్కరణము, వైదికజ్ఞానము వీనిని విశేషముగా లక్ష్యమునందుంచుకొనెను.

(౧) జాతీయజ్ఞానమును నవీన శిక్షణద్వారా దృఢపఱచుట పరమావశ్యకము. వర్తమాన శిక్షణ భ్రమపూర్ణము. ఇది యాంగ్లేయాదర్శములకు నికృష్ట అనుకరణము మాత్రమే. అందువలన నిందుజీవన సిద్ధాంతములు చాలతక్కువ.

(౨) ఆత్మగౌరవము నభిమానమని యెంచకుడు. రండు- మనము మనయపరాధములను స్వీకరింతము. మనయలవాట్లు మనలోటులు, మనలను ప్రభుత్వముకంటె మిన్నగా నీచుల నొనరించినవి. స్త్రీలయు నిర్ధనులయు విషయమున సమ్మాన దృష్టినుంచుడు. వారి మానవాధికారములను రక్షించుడు. మన సమాజము వీరిని చిరకాలమునుండి పాదతలముననడంచినది. ఇందుకు స్వయముగా మనము ప్రాయశ్చిత్త మొనరించుకొన వలసియున్నది. అన్యరాష్ట్రములందు తన సందేశమును గొని పోవుటకు ముందే భారతవర్షమునకు ప్రాయశ్చిత్తసంస్కారము జరుగవలసియున్నది.

(3) వేదజ్ఞానమే భారతవర్ష సందేశము. ప్రపంచము దీనినాదరించును. ఇది యాత్మమహత్త్వమును ఘోషించుచున్నది. వాస్తవమున నితిహాసము రాజనీతిజ్ఞులది కాదు. అది ఋషులయు, తపస్వులయు, ఆత్మసమర్పకులయు గ్రంథము. నిర్మాణశక్తి కోలాహలమున నెన్నడు లభింపనేరదు. తపస్య- ఈశ్వర ప్రదత్తబుద్ధి-వీనిద్వారా ప్రాప్తించును. అందువలననే

మనము, బుద్ధుడు, శంకరుడు, నానక్, గౌతముడు, డార్విన్ ప్రభృతి మహాత్ములను ఆదరించుచున్నాము. ఇట్టి సంబంధముచేతనే నేను దయానందునకు నమస్కరించుచున్నాను.

ఈ దేశము నుద్ధరించుటకై దయానందుని మనకొఱకంపిన భగవంతున కనేకధన్యవాదముల నొనరించుచున్నాడ.



## ఆధునిక యువకులకొక మంత్రము

దయానందుని జీవనమును పరిశీలించుడని నవయువకులను ప్రేరేపించుటలో నాయభిప్రాయమేమి? ఆతడు 'శక్తి' సందేశదాత. భారతవర్షమున కిపుడు శక్తి కావలసియున్నది. బలవంతులే దేశమును రక్షింపగలరు. ప్రపంచము బలవంతుల నాదరించును. నిర్వీర్యసౌజన్యము కొఱగానిది. ఏకతయందు శక్తి నివసించునని చెప్పుదురు. ఇట్లే శక్తివలన నేకత, స్వాధీనత జనించుననియు చెప్పనొప్పును.

బలవంతులుకండు! వర్తమానభారతమున కిదియే మంత్రము. ఇది ప్రాచీన ఋషుల మంత్రము. గొప్పగొప్ప శక్తులు అగ్నివలన నుత్పన్నములగునని వేదమున జెప్పబడినది. "శరీర మస్తిష్కములలో నీవు బలవంతుడవగుము" అని యజుర్వేదమున నేను జదివితిని. దయానందుడు శక్తి సంబంధిభావములతో నిండియుండెను. అతడెవరిని క్షమింపుమని కోరలేదు.

నిర్భయుడై తన యనల్పసందేశమును జనుల కొసంగెను. సమాలోచకులతనిని కలహశీలుడనిరి. అనేకులతనిని శపించిరి. కొందఱతనిపై ఱాళ్లురువ్విరి. కాని యతడు వానిని లెక్కింపక దేశవాసులను మేల్కొల్పుచు పలుచోట్లవిహరించెను. జనులు భాగ్యముపై నాధారపడి తమ పతితావస్థయందే సంతుష్టులైరి. దయానందుడు "భావిమహాభాగ్యము" మీద భరోసా నుంచుడని యుపదేశించెను.

అతడు శక్తిశాలి. ఆహా! అతని శరీరమెంత బలిష్ఠముగా నుండెను! మనయువకులలో ననేకుల శరీరము దుర్బలముగా నుండును. శారీరిక దౌర్బల్యము పౌరుషహీనతకు లక్షణము. బలవంతులే కొంచెము చేయగలరు. మీరు మీ శరీరములను బలిష్ఠమొనర్చుడని నేను యువకులతో చెప్పుదును.

శరీర నిర్మాణమున కాధారము బ్రహ్మచర్యము. భోగవిలాసములు యువకులను నష్టమొనరించినవి.

ఇంద్రియములను తన వశమున నుంచుట బుద్ధికుశలత యనబడును. దయానందుడు తన గురువగు విరజానందునివలె బాలబ్రహ్మచారి. నేటి నవయువకులు విషయభోగములందు నిమగ్నులై యుందురు. నిరంతరామోద ప్రమోదములలో జిక్కి వారి శరీరము క్షీణించి రోగగ్రస్తమగుచున్నది. లండనులోనున్న కింగ్‌కాలేజీలో నుపన్యసించుచు ప్రసిద్ధుడగు జర్రాహ్ ఆర్థర్ కేథ్ ఇట్లు చెప్పెను. "నేత్రముల కాంతి తగ్గుటకు కారణము వానిచే నధికముగా పనిచేయుటకాదు. భోజన

కొఱంతయే. మన శరీరములు ప్రస్తుత సభ్యతవలన నూత్నదశలలో గ్రస్తమైనవి. వర్తమాన ఖాద్య పదార్థములవలన మన పాచనశక్తి క్షీణించుచున్నది. రోగములవలన దంతము లూడుచున్నవి. మన స్నాయుమండలము (Norvous System)చెడి పోవుచున్నది. తాలు సంకోచము సాధారణ విషయమైనది".

భోగమనగా శారీరిక - మానసిక - ఆత్మిక దౌర్బల్యమని యర్థము. నేడు భారతమునకు శక్తిసందేశమావశ్యకమైయున్నది. అమెరికావాసుల మూలమంత్రము సామర్థ్యము.

భారతవాసులకును మూలమంత్రము శక్తియై యుండవలె. బలవంతులగు స్త్రీపురుషులే దేశమును స్వాధీనము చేయగలరు. అందువలన తమ శరీరములను బలపఱప యువకులను ప్రేరించుచున్నాడ. బలవర్ధకములగు నాటలలో రుచిని పెంచుట యావశ్యకము. యూనాన్ నవయువకులు వ్యాయామశీలురయి యుండెడివారు. జాపానులు శిక్షణ ప్రియులు. అట ప్రతిగ్రామమున పాఠశాలలున్నవి. ౧౦౦౩ కి౦ మంది మనుజులు వ్రాయను, చదువను, లెక్కలు వేయను తెలిసికొని యుందురు. జపాను శిక్షిత రాష్ట్రమనిపించుకొనియుతృప్తినొందజాలకున్నది. శక్తిశాలి రాష్ట్రమనబడ కోరుచున్నది. జపాను మనుష్యునిజేయు శిక్షయందు విశ్వాసముంచుచున్నది. అచ్చట యువకులకు వ్యాయామము సైనికశిక్ష, ఈదుట - లక్ష్యము భేదించుట - పర్వతముల నధిరోహించుట - వేషపరివర్తనము జేసి యుద్ధమొనరించుటయు నేర్పబడుచున్నవి. ఆయుధ ప్రయోగశిక్షణయు నొసంగబడుచున్నది. సంవత్సరమున నొక

పర్యాయము రాత్రిసమయమంతయు యాత్రచేయుటకై యువకులు పిలువబడుదురు.

మన శరీరములు సహనశీలము గలవిగా నుండవలెను. ఇది ఫిన్‌లాండ్ నవయువకుల మూలమంత్రము. ఆట నందఱికంటె నెక్కువ చక్కని ఖేలనము చూపువారికి రాజకీయపన్ను తీసివేయబడును. శీతకాలమున పిన్నవయసుగల బాలబాలికలు కొన్నిమైళ్ల దూరము కాలినడకనేగ ప్రోత్సహింపబడుదురు. పౌరుషమునకు సంబంధించిన సభ్యతకు రెండేచిహ్నములు. మొదటిది బలవర్ధక క్రీడలందు పాల్గొనుట. రెండవది కర్మవీరుల సత్కరించుట. బలమును పెంపొందజేయుట జపానుకు ముఖ్యోద్దేశమై యున్నది. జాపానుల హృదయమందిరమున వీరుల విషయమున నసీమప్రేమ యుండును. వారిలో వ్యాయామమునకు సంబంధించిన భావము లతిసుందరములు. చీనాదేశీయులలో నీభావములు లేకుండుటచే యధోగతినున్నారు. ఇటలీలో అమెరికా సంయుక్త రాజ్యముల రాజదూతయగు మి ఆర్ డబ్ల్యు, చాఇల్‌డ్ ఒకమారిట్లు చెప్పెను. "మీరు మీ యిష్టము వచ్చినట్లు జాపానుల విషయములో నెంచుడు. కాని 3000 చదరపుమైళ్ల విస్తారముగల యీరాష్ట్రమొక్కటే నేడు స్వయం శాసన మొనర్చుచున్నది. వారెన్నడు పాదాక్రాంతులై యుండిలేదు. వారిపైనెన్నడు వైదేశికశాసము వర్తింపలేదు. అంతరరాష్ట్రియ సంధిని వారెన్నడు భగ్నమొనర్చలేదు. ఆ దేశమున నొక యద్వితీయ ఖేలనముద్వారా ఆత్మసంయమమునకు ఆత్మసమర్పణమునకు సంబంధించిన ప్రశస్తపాఠము పఠింపజేయబడుచుండెడిది. ఆయాటలో వారు వ్యర్థముగా ఖడ్గమెత్త

కుండుటకును, ఎత్తినచో చంపుటకు చచ్చుటకును సిద్ధమై యుండవలయునను శిక్షను బొందియున్నారు." జాపానుల విషయమున నీవాక్యములు యథార్థములు. జపాన్ క్రీడలందు రుచిగలదేశము. శతాబ్దములనుండి చీనా విదేశాధిపత్యమున నున్నది. ఈ జాపానులే దానిపై నధికారము చేయుచుండిరి. అల్పసంఖ్యాకులగు దోపిడిగాండ్రవలన ४౦ కోట్ల సంఖ్యగల స్త్రీ పురుషులు దుఃఖముల ననుభవించుచున్నారు. కారణమేమి? చీనులు బలవర్ధకములగు నాటలాడుచుండగా మీరు చూచి యుండరు.

అట్టి యాటల జ్ఞానమైనను వారికుండదని యెంచెద. బలవర్ధక క్రీడలను, వీరుల సత్కారమును మనముకూడ తిరస్కరించితిమి. భారతవర్షపు విద్యాలయములందును కలా శాలలందును పై రెండువిషయములందును విశేషలక్ష్య ముంచ వలెను. వర్తమానశిక్షలో నధికభాగము కుశిక్షయే. శిక్షాఫలము ఉత్తమచరిత్ర నేర్పఱచుటయై యుండవలయును. శక్తి లేక చరిత్ర యెట్లేర్పడగలదు? ఈ శిక్ష యనుకరణము మాత్రమే. అందువలననిది మనుష్యులను సిద్ధము చేయ నేరదు.

దయానందు డార్యసంస్కృతిని పొషించుచు చరిత్ర రచనయొక్క మహత్త్వపూర్ణ ప్రశ్నమును లక్ష్యమున నుంచు కొనెనని నా విశ్వాసము, భారతవర్షపు పాఠశాలలో రామాయణ మహాభారతముల శిక్షణ నిష్కారణముగా నీయబడుచుండెడిది కాదు. వీనిలో శక్తి సందేశము నిండియున్నది. రామ-కృష్ణుల శిక్షణ కేవలము పుస్తకములమీద నాధారపడి యుండలేదు. ధర్మము ద్వారా దీని మహత్త్వము పెంచబడెను. వారికి చదు వుట వ్రాయుటయుగాక శరీరముతో మస్తిష్కమునను చరిత్ర

మునను బలవంతులగుటకు శిక్షణ యొసంగబడెదిది. క్షత్రియ తేజస్సు పరిత్యజింపబడలేదు. కాని ధర్మముద్వారా దాని మహత్త్వము పెంపుచేయబడెను.

పౌరుషోత్పాదక సభ్యతారహితమగు దేశమునశించును, వర్తమాన యువకులకు ముఖ్యమంత్రము శక్తి.

## మదీయ మాతృభూమి

దయానందుడు భారతవర్షమును పతితావస్థలో జూచెను. ఆ దీనావస్థయందు పడియున్న భారతమున నతనికి ఉజ్జ్వల భవిష్య చిహ్నములు దృగ్గోచరములయ్యెను. తనదేశము భావియందతనికిఆశ్చర్యమగుపూర్ణవిశ్వాసముండెను.తనజాతిభవిష్య భాగ్యోదయమున నతనికిగల విశ్వాసము విస్మయజనకము. ఆర్యుల ఆదర్శము దేశమునకతడు కోరుశక్తి నొసంగ సమర్థమై యుండెను. ఈ విశ్వాసమునందే దయానందుని దేశప్రేమ కేంద్రితమైయుండెను. చరిత్రమునగల యాశ్చర్యమయ ఘటనలలో హిందూ (వైదిక) జాతియొక్క ద్రఢిమయొకటి. ప్రపంచమునగల జాతులలో నీహిందూ (వైదిక) జాతియొక్కటే యనేకపరీక్షల నాపత్తుల నెదుర్కొని నేటికిని జీవించుచున్నది. అక్రమణ మహావాతములు పలుమారు దీనినున్మూలింప యత్నించెను. ఇది నమ్రత వహించినది కాని భిన్నము కాదయ్యె. శతాబ్దములకొలది రాజ నైతిక పరివర్తనములు జరిగినను హిందువులు (వైదికులు) సమష్టి రూపమున ఒకరి నొకరు విడువరైరి. ముందంజవేయ

లేక పోయిరని యొప్పుకొనక తప్పదు. ఇందుకు ఫలముగా, హిందువుల (వైదికుల) కును ఆదర్శ హిందూ (వైదిక) త్వమునకు సంబంధించిన దర్శన శాస్త్రములకునుమధ్య, భూమ్యాకాశములబోలి విభేదము నొనరించు భయంకర పద్ధతులు ఆచారములును హిందువులలో (వైదికులలో) నెలవు కల్పించుకొనినవి.

ఓ వైదికజాతి! నీవీభయంకరములును శక్తినాశకములునగు కురీతులను అసదాచారములను విడనాడుము. మానసిక-సామాజిక-ఆధ్యాత్మిక స్వాధీనతా ప్రాంగణమున ప్రవేశించుము, నేడీ సందేశమును బలపూర్వకముగా వ్యాపింపజేయుట మిక్కిలి యావశ్యకమని నాయభిప్రాయము. భారతవర్షము తనభవిష్యమును జూచుచున్నది. ఇందులకై యది తన భూతకాలమును గుర్తింపవలసి యున్నది. హిందువులు (వైదికులు) మరల తమ జాతీయశక్తిని సంపాదింపవలయును.

దయానందు డార్యజాతి సబలమై యుండ జూడనెంచెను. అది బలయుక్తము కావలయునన్న తన భూతకాలమునకు దృష్టిమరల్చవలసి యున్నది. దీని మహత్త్వ నిర్మాణము నిజ పరంపరాగతశ్రేష్ఠ మర్యాదలమీద నిర్భరమైయున్నది. తన పూర్వజులగు ఋషులు వీరులునగు వారివిషయమున నెవరి హృదయమున ప్రేమయుండదో వారిరాష్ట్రము పెంపొందనేరదు.

వర్తమాన శిక్షాపద్ధతి పరంపరాగత మర్యాదల తిరస్కరించుటయేగాక మనలను బలహీనులను జేయుచున్నది. ఇది మనస్కూల్ కాలేజీలలో జదువు విద్యార్థుల హృదయములందు భారతవీరుల యెడ ప్రేమ కలిగింపదు.

ఎందఱు విద్యార్థులు మహారాణా ప్రతాపుని జీవనమును మననము చేసియుందురు? ఆరాజపుత్రుని కథ యితిహాస మునగల రోమాంచము నొదవజేయు కథలలో నధిక రోమాంచ కారి. అతడొక యలౌకిక పురుషుడు. అతనిలో దృఢమగు నిచ్ఛాశక్తియు నగాధ శారీరికశక్తియు నుండెను. ఆ 'చిత్తౌర్' రాజకుమారు డుపవాసములు చేసెను. శయ్యారహిత వనస్థ లుల శయనించెను. ధర్మపత్నియు సుకుమారులయిన బిడ్డ లును పర్ణింపనలవిగాని కష్టముల నెదుర్కొను చుండుట తన కన్నులతో జూచెను. కాని శత్రువున కధీనుడగుట కంగీకరింప డయ్యె.

'చిత్తౌర్'ను దర్శించుట వీరులపై నశ్రువుల ప్రవహింప జేయుటగును. చిత్తౌర్ నేటికిని రాజపుత్రవంశపు వీరుల సహృదయతను వీరతను స్మరింప జేయుచున్నది. తథాపి వైన కవర్న (Bannockburn) యొక్క సమరరాగము నాలాపించు మనభారతీయ పట్టభద్రులలో నెందరిని చిత్తౌర్ వీరవర్ణన, పుల కితుల జేయగలిగెను?

దయానందుడు అధునిక భారతవర్షముయొక్క యాధ్యా త్మిక జాతీయత నుపదేశించు ధర్మాచార్యులలో నగ్రగణ్యుడని నా నమ్మకము. "ఆర్యసమాజము" అను నీశబ్దము రాష్ట్రీయ తకు ద్యోతకముకాదా? భారతరాజనైతిక నాయకులు 'రాష్ట్రీయ కాంగ్రెస్'కు రాష్ట్రీయనామము నెప్పు డొసంగుదురు?

దయానందుడు దేశమునందన్నియెడల ఆర్యసంస్కృతి యొక్కయు, సభ్యతయొక్కయు మహాసందేశమును ఘోషింప

జేసెను. రాష్ట్రహితమునకు దయానందుని సందేశములన్నియు బహుమూల్యములు. భారతవాసులను ప్రజాతంత్రపు టాదర్శముల కనభిజ్ఞులనువారు భారతేతిహాసమును సరిగా నెఱుగరు. నేడు మనము స్వరాజ్యచర్యల నొనరించుచున్నాము. స్వరాజ్య శబ్దము వైదికము. స్వరాజ్య పూజయందు ప్రవృత్తులగుట కావశ్యక వికాసము నభిలషించు గుణములొక వేదమంత్రమున వర్ణింపబడియున్నవి. నిర్వాచన సిద్ధాన్తములును వేదములందుల్లేఖింపబడియున్నవి. "హే రాజన్! జనులు రాజపదమునకై నిన్నెన్నుకొనుచున్నారు" అని నేను చదివితిని. మఱియొక మంత్రమున నవనిర్వాచిత రాజును సంబోధించుచు నిట్లు వర్ణింపబడినది. "రాజన్! నీవు నీసమస్తప్రజల శుభకామనలు సఫలముజేయుటకును, నీరాజ్య నాశకరమగు విషయములను గుర్తించుటకును దృఢముగా నిలబడుము."

దేశానురాగమునకు సంబంధించిన పవిత్రభావనలతో నిండిన మంత్రములెన్నో గలవు. ఋగ్వేదమున నొకచో "జననియు జన్మభూమియు స్వర్గముకంటె శ్రేష్ఠములని వర్ణింపబడియున్నదీ. అథర్వవేదమున" మాతృభూమి మదీయమాత. నేను తదీయపుత్రుడను. నేను మాతృభూమికి ప్రణామమొనర్చుచున్నాడ"నని యున్నది. స్వరాజ్యచర్చల నొనర్చువారు ప్రాచీన రాజనీతిని మననముజేయుట యావశ్యకము. ఇంగ్లండు ననుకరించునేని భారతవర్షము యథార్థముగా మహత్త్వమును సంపాదింపనేరదు.

మన స్వరాజ్య నిర్మాణవ్యవస్థ (Constitution) పాశ్చాత్యదేశముల ననుకరింపగూడదు. మనస్వరాజ్యపుటాధార

శిల భారతప్రతిభయు నాదర్శనమునై యుండవలెను. పాశ్చాత్యుల యనుభవమునుతిరస్కరింపుడని యభిప్రాయముకాదు. కాని నవీనరాష్ట్రీయ జీవనముతో సంబంధము గల్గినట్టియు, ఆకర్షణ నొనరించునట్టియు శక్తులను మనముమనలోనే వెదకవలయును.

యజుర్వేదమున "నీమస్తిష్కము శరీరమును బలవంతమగుగాక" అని చదువుచున్నాము. తరుణభారతమునకు శక్తి సందేశమావశ్యకము. ఈ శక్తి యజ్ఞమువలె ప్రజ్వలింపవలసి యున్నది. యజ్ఞము, హవనము నత్యంతోపయోగకరములు. వివాహము మొదలు దాహకర్మ సంస్కారమువఱకు నగ్ని మనకు సాక్షిగానుండును.

దయానందునికి నా నమస్కారములు. దయానందుని నేను ఐతిహాసిక నాయకులలో నొకడని యెంతును. అతడు యజ్ఞమయశక్తి సందేశమును మన కందజేసెను.

ఆత్మిక జీవనమున సబలమై యున్నపుడు భారతవర్షము సర్వోత్కృష్టమై యుండెను. నేడు ధూళిలో పడియున్నది. దీని సంతానము ఋషుల బహుమూల్యముత్యములకుబదులు భోగవిలాసముల నుపాసించువారి సంస్కృతినుండి తళుకు బెళుకులు గల వస్తువులను గ్రహించిరి. నవయువకులారా! మీరగ్నిశిఖలవలె తేజోవంతులగుడు. సాధారణ జీవనమును సంపాదింపుడు. మీరనేక నిద్రిత శతాబ్దములచే నాక్రమింపబడియున్నారు. ఈ శతాబ్దములు తన జ్ఞానగీతలతోబాటు మీ శక్తి స్పర్శవలన మేల్కొనును. మీకిదియే నా సందేశము.

మృగతృష్ణలతో క్లాంతమైయున్న భారత నవయువకులారా! మీ స్వాధీనత యనుకరణమునగాక శక్తివలన నేర్పడగలదని యీ శతాబ్దములు మీకు బోధించును.

బ్రహ్మచర్యము-నిర్ధనులయు ననాథులయు సేవ - సత్యము-ప్రేమ వీనియొక్క తపోబలమున శక్తిని దృఢపఱచుడు.

ఈశక్తిచేతనే విశాల ఆర్యావర్తము మరల జన్మించును.



# భవిష్య ప్రదీపము

ప్రపంచమునగల లోటేమి? అవిద్య. ఒకే విధమగు జ్ఞానమన్వేషింప బడుచున్నది. అందధికభాగము మృతజ్ఞానమైయున్నది. విద్య మృత జ్ఞానముకాదు. అది జీవనముయొక్క యాధ్యాత్మిక కేంద్రము కొఱకగు నన్వేషణము.

సాధన విరహితమైన యన్వేషణ మెక్కడ? అధ్యయనము స్వయముగా సాధనము. దీనిని సఫలము చేయవలయునన్న యితర సాధనము లపేక్షితములు. ప్రాచీన గురుకులములందు నాశ్రమములందును విద్యార్థులు ఆచరణమునకు తెచ్చు అధ్యయనాతిరిక్తసాధనములు-బ్రహ్మచర్యము, పరిశ్రమము, ఉపాసనయునై యుండెను.

బుద్ధిమత్తతగా పరిణమించు జ్ఞానము పుస్తకములవల్లనవలన లభింపనేరదు. ఆత్మశిక్షణ లభింపజేయునది విద్యయన

బడును. ఆ శిక్షణ శరీర మనస్సుల బ్రహ్మచర్యము లేక కలుగదు. సరస్వతీ వివాహము శాశ్వత బ్రహ్మచారితో నయ్యెనని యార్యులు నిష్కారణముగా జెప్పియుండరు.

పాశ్చాత్య దేశముల నవయువకుల యాందోళనములలో బ్రహ్మచర్య సత్యముపరిహసింపబడుచున్నది. ప్రాచీనకాలమున విద్యార్థుల జీవనోత్కర్షత బ్రహ్మచర్యమని యెంచబడుచుండెడిది. శరీరమును మనస్సును నియంత్రణలో నుంచుట, విచారములను మనోరథములను పవిత్రముగా నుంచుటయు మనుష్యునకు లక్ష్యములుగా పరిగణింపబడెడివి. భోగవిలాసములు. జీవనమును నికృష్టముచేయును. రెండవ సాధనము పరిశ్రమము-చేతిపనులు. "విద్యార్థులు తమ గురువులకు జలమును తెత్తురు-ఇంధనముల నేరిచేర్చుదురు. వారి పశువులను పాలింతురు" అని నేను చదివితిని. ఈ విధముగా సేవాశ్రమములందు విద్యాధ్యయనము జరుగుచుండెడిది. ప్రాచీన భారత శిక్షణాలయములందు సదాచారము పరిశ్రమము తోడ్తో లభించెడివి.

మూడవ సాధనము దైవికోపాసన. అధ్యయనము-బ్రహ్మచర్యము-పరిశ్రమము, ఉపాసన యివి ప్రాచీన భారత గురుకులమును పుణ్యతీర్థ మొనరించినవి.

శిక్షణ-స్వాస్థ్యము-శాస్త్రము-స్వదేశికృషి-అను నీనాలుగు విషయములందు విశేషధ్యాన ముంతుమేని స్వరాజ్యప్రాప్తి శీఘ్రముగా కలుగును. వీనినిగూర్చి నేననేక ప్రకారముల విచారించియుంటిని,

ప్రాచీన భారతమున విద్వాంసులు ప్రచారకులు భిన్న భిన్న స్థానములకేగి శాస్త్రవిషయములను ప్రచారమొనర్చుచుండెడివారు. వారు జనులయెదుట మహాత్ముల జీవనచరిత్రలను జదివి వినిపించెడివారు. ఆ సమయమున సాధారణ జనుల శిక్షణలో వాస్తవికత యుండెడిది. ప్రస్తుతము 'యూరప్'లో సర్వసాధారణ శిక్షామహత్త్వమును తెలిసికొనుచున్నారు. దానికొఱకై యట పుస్తకాలయములు - వాచనాలయములు-వ్యాఖ్యానశాలలు నేర్పఱపబడినవి. అచ్చటిజనులు మనదేశపు సాధారణ జనులకంటె నధికముగా వర్తమాన జీవనమును ప్రేమింతురు. పాశ్చాత్యదేశపు చర్మకారుడు మనదేశపు మధ్యమశ్రేణి జనులలో చాలమందికంటె నెక్కువరాజకీయములలో పాల్గొనును.

మనదేశపు సాధారణ జనులు పురోహితుల సేవకులై యున్నారు. మన పరిశ్రమలు సువ్యవస్థలో లేవు. మన కృషీవలురు నేటివఱకు కృషికి సంబంధించిన శాంతియందే నివసించుచున్నారు. ప్రపంచమున నేయేపరివర్తనలు జరుగుచున్నదియు వారెఱుగరు. పశ్చిమమున బహుదేశములందు సర్వసాధారణులు శిక్షితులై యున్నారు. కొన్ని వర్షములకు పూర్వము నేను 'బ్రిస్టల్' నందు శ్రమజీవుల (కాన్ఫరెన్సు) మహాసభలో భాషణ నొనరించి యుంటిని. అపుడనేక శ్రమజీవుల సంఘములు భారతీయసమస్యా విషయిక ఉత్సాహము కలిగియున్నవని తెలిసికొని యాశ్చర్యపడితిని.

కృషికులయు, శ్రమజీవులయు పాఠశాలల యుపయోగమును గుఱించి యత్యుక్తి నెవడు నుపయోగింపజాలడు. భవి

ష్యము సర్వసాధారణుల హస్తగతమై యుండును. యోగ్య నేతృత్వమున సర్వసాధారణులు చేయనేరని దేమున్నది! మనము 'కమాల్' యొక్క విజయచర్చ నొనరించుచున్నాము. కాని అతని గొప్పతన మా కృషికులవల్ల ననునది మఱచుచున్నాము. వర్తమాన రష్యామీద నచటి శ్రమజీవుల ఋణ భారమున్నది. రష్యాలో కృషికులకొఱకు శ్రమికులకొఱకును వేలకొలది పాఠశాలలు పుస్తకాలయములు తెఱవబడినవి. క్రాంతికి తరువాత నేటివఱకు 6 కోట్ల మంది రూస్ నివాసులు వ్రాయుట చదువుట నేర్చుకొనిరి. ప్రతిచోట భవిష్యము సర్వసాధారణ హస్తములలో నుండును. అందువలన సర్వసాధారణుల శిక్షితుల నొనరింపుడు.

నేను పాఠశాలల కుడ్యములందు భారతవర్షపు ఋషులయు, కవులయు, వీరులయు, ఆత్మసమర్పకులయు, ధర్మాచార్యులయు తైలచిత్రములు వ్రేలాడుచుండ జూడ నభిలషించుచున్నాడ. ఈ చిత్రములలో ప్రతిది యొక్కొక్క శిక్షకుని కార్యమొనరించును. ప్రతి చిత్రమొక పాఠమును సర్వాంగ సుందరరూపమున మనయెదుట నుంచును. మన సాధారణజనులందఱు రామాయణమహాభారతములను పఠింపవలయునని నాకోరిక. ఈ ప్రాచీనగ్రంథములలో నాశ్చర్యపూర్ణ విషయములు నిండియున్నవి. మహాభారతమును జదివిన నొక్కొక్కపుట యందెట్టి సుందరసూక్తులున్నదియు జూడ నగును. "విశ్వాస రాహిత్యము నరకద్వారము" మీ పిల్లలకీ పాఠమును నేర్పుడు. కాలాంతరమున నిశ్చయముగా వారు ఆఫీసులందును-దుకాణములందును విశ్వాసపాత్రులనిపించు

కొందురు. "సత్యము పరమాత్ముని స్వరూపము" ఆహా! యిది యెంత సుందరవచనము. "మైత్రి సమానులలో నెఱవేరును" స్వరాజ్యముయొక్క సంపూర్ణతత్త్వమీసారగర్భిత సూక్తిలోనిమిడి యున్నది. ఇండియా బ్రిటనులలో మిత్రభావ మేర్పడవలయు నన్న హిందూస్థానము(ఆర్యావర్తము)స్వతంత్రమగుట పరమా వశ్యకము."ప్రేమ మనశాస్త్రము".భారతవర్షముచరిత్రమున తన యుత్కర్షత ననుభవించుదినములలో ప్రేమయొక్క యాదర్శ వాదమునకు సాక్ష్యమిచ్చి యుండెను. ప్రతివిద్యార్థిని "ప్రేమ మనశాస్త్రము" అను సందేశము నొసంగుటలో నాకుత్సాహము కలుగును. ఈ ప్రేమసందేశము భారతవర్షపు ఋషులయు, మహర్షులయు హృదయములను మనయెదుట విశదపఱచు చున్నది. ప్రేమించుట వ్యాపారమొనర్చుట కాదు. ధనసంచ యము చేయుటకాదు. ఇతరులను తనవలలో జిక్కించుట కాదు. ప్రేమను సదుపయోగము చేయుము. బుద్ధభగవానుడు వనాశ్రమమునుండివెడలి సాంసారికుల దుఃఖనివారణకార్యము నారంభించును. ఒకనాడకస్మాత్ రాజప్రసాదమున తల్లిదండ్రు లను కలిసికొనును. వారిరువురు నతనిని సాధువేషమున హస్తమునకమండలువు గ్రహించియుండుట జూచి దుఃఖితులై "రాజకుమారా! రాజ్యైశ్వర్యములను విడనాడి యిట్లు భిక్షాటన మేలచేయుచుంటి"వని యడిగిరి. అందులకు భగవానుడు "పూజ్యమాత పితరులారా! నేను నాజాతీయరీతి ననుసరించు చున్నాన"ని జవాబిచ్చెను. ఆహా! మన ఋషులు, మహర్షులు కవులు ఆచార్యులునందఱు త్యాగరీతి ననుసరించిరి. దయా నందుడు త్యాగి. త్యాగశిక్షణమును బొందినవారే నవీనయుగ నిర్మాతలగుదురు. భారతవర్షమున పునరుజ్జీవన బీజముల

నెవరు విత్తుదురు? ధనాభిమానులు కారు. పదాభిలాషులు కారు. తపస్వులు విద్వాంసులు నందులకర్తులు. వీరు జన సముదాయమునకు సహయోగ మొనర్తురు. భారతసేవకు స్వాధీనతకునై వారిని శిక్షితుల జేయుదురు. మన విద్యాలయములు ఆర్యావర్తపు నిరాడంబర ఆధ్యాత్మిక వాతావరణమున చరించునుగాక. దీనియందే మాకాశ యున్నది. దీనివలననే రాష్ట్రకల్యాణము కాగలదు.

ప్రాచీనజ్ఞానము భవిష్యమున నొకసందేశము నిచ్చుచున్నది. ప్రకృతియొక్క నిస్తబ్ధతలో, వర్తమాన గర్వరహితయధ్యాత్మవాదమునను, అడంబరరహిత వనాశ్రమములలోను అపరిమిత జీవనముతో నిండిన భ్రాతృసంఘములలోను, ఇతిహాస ప్రభాతమునందును ఆర్యసంస్కృతి జన్మించినది. దీనికెంతో దూరముగా నీ సంస్కృతి, నాగరికతను పోషించు వర్తమానసభ్యత పరిణమించినది. మనము భ్రాతృత్వముయొక్క జీవనముయొక్క స్వాభావికానందమును కోల్పోయితిమి. నేడు భోగమునకు, ఆత్మతృప్తికి,నిర్బలులను హింసించుటకు సభ్యత (Civilization) అనుపదము మృదుమధురముగా వాడబడుచున్నది. మనమీ సభ్యతయొక్క పరిణామ మెఱుగుదుము. అది దుఃఖము! ప్రపంచశాంతి యాత్మికజ్ఞానమునను వైదికజ్ఞానమున నున్నది. మనదేశములో భవిష్యప్రదీపమును తమహృదయములలో గ్రహింప బలవదిచ్ఛగల యువకులు పలువురు ఏర్పడునట్లు పరమాత్ముడనుగ్రహించుగాక.



!

# తరుణ భారతమునకు సందేశము

గతరాత్రి నాతో నొక యుత్సాహియువకు డిట్లనెను "నేను దయానందుని సంక్షిప్త జీవనమును జదివితిని. అందతడు వైదికశాస్త్రార్థముల కొఱకొకచోటి నుండి మఱియొక స్థానమునకు నిరంతరము పరువిడి నట్లున్నది. కాని భారత యువకుల కామహర్షి సందేశ మేమి?"

దయానందుని జీవనమింకను అపూర్ణముగా నున్నది. అతని జీవనము వైదిక శాస్త్రార్థముల కంటె నెంతో బహుమూల్యము. 'కార్ లాయల్' ఒకచో "ఒకసుందర చిత్రము ప్రథమమున చూచినపుడది తుచ్ఛముగా గనబడును. పునరవలోకనమున దానిసౌందర్యము గోచరింపదొడగున"ని వ్రాసియున్నాడు. దయానందుని జీవితము నిట్టిచిత్రమే. దానిని నేను పలుమారు జూడనారంభించితిని. ఎన్నిమారులు జూచిననన్ని క్రొత్తలు నాకందు కాననయ్యెను.

దయానందుడు మనుష్యజాతిని ప్రేమించెను. కాని యతని మనుష్యప్రేమ తనజాతిని వేఱుపఱచుటకాదు. అతని సందేశము ఆర్యజాతీయ భావనతో, భారతరాష్ట్రీయతతో ప్రోత్సహింప బడుచున్నది. అతని హృదయమున ప్రాచీన వైదిక మంత్రముల భావన ప్రతిధ్వనించుచున్నది. 'మాతృభాష', జాతీయసభ్యత, మాతృభూమి యీమూడును భద్రమునకు స్రోతస్సులు. వీనినే మీ హృదయముల స్థాపించుడు.

దయానందుడా ప్రసిద్ధ దేశభక్తులగు దాదాభాయీనౌరోజీ లోకమాన్య తిలక్‌జీకంటె పూర్వమే స్వరాజ్యశబ్దమును ప్రయో

గించెనని మీలో నెందరెఱుగుదురు ? దయానందుడు తాను ప్రవర్తింపజేసిన ఆర్యసమాజమున, ప్రజాతంత్రాత్మక నిర్మాణ ముంచెను. ఆతని రాజనైతిక భావములు ప్రజాతంత్రసూత్రములతో బంధింపబడియున్నవి. యజుర్వేదమున ౧౬వ యధ్యాయపు ౨౪వ మంత్రమునకు భాష్యము వ్రాయుచు "మనుష్యులు తమదేశముయొక్క శాసనమొకవ్యక్తి ద్వారాగాక సభద్వారా జరుగునని యెల్లపుడు గుర్తింపవలయును" అని వ్రాసియున్నాడు. సత్యార్థప్రకాశమున నొకసారగర్భిత వాక్యములోని యార్య విచారమునిట్లు విస్తారముజేసిరి. " రాజు మనుష్యుల రక్షకుడు. ఎవడెంతచేసినను స్వదేశరాజ్యము సర్వోత్తమమగును. మతమతాంతరము లందాగ్రహము లేక పక్షపాత శూన్యమై ప్రజలను మాతాపితరులబోలి ప్రీతి మెయి న్యాయముతో ప ర్తించునదైనను విదేశీయుల రాజ్యము సుఖదాయకము కానేరదు" క్రీ. ౧౮౮౨ లో ఋషిచే వ్రాయబడిన యీ శబ్దములు స్వరాజ్య విచారముల మూలతత్త్వమును ప్రకటింపజాలవా? స్వరాజ్యముత్తమ రాజ్యముకంటె శ్రేష్ఠమైనది. దయానందుడు భారతపతన కారణములను సైతము విశ్లేషించెను. అతని యీ క్రిందివాక్యము లైతిహాసిక జ్ఞానముతో నెంత నిండియున్నవో చూడుడు.

"స్వాయంభువు రాజు మొదలు పాండవుల పర్యంత మార్యుల రాజ్యము సార్వభౌమముగా నుండెను. తరువాత పారస్పరిక కలహమువలన నష్టమయ్యెను.

"సోదరులు పరస్పరము కలహింతురేని విదేశీయులు పంచాయితీ లగుదురు. పారస్పరిక బేదములవలన హా[illegible]

పాండవ కౌరవులు యాదవులు నష్టపడిరి. ఈ వ్యాధి నేటికిని మనలను విడువదయ్యె".

దయానందుడు, భేదబుద్ధియను రోగమును పలుమారు భయానకముగా వర్ణించుచు నది ఘృణితమని బోధించెను. అది దుర్యోధనుని పాపము. మన సమస్త సుఖముల నపహరించి దుఃఖసాగరమున ముంచునది. దయానందుడు తన దేశవాసుల దొసగులను దాచడు. ఆంగ్లేయులు మనపై రాజ్యమేల చేయుచున్నారు? దయానందు డందులకు ఆంగ్లేయుల దేశభక్తి, ఆత్మసమర్పణబుద్ధి, వారిశిక్షణ, ఉత్తమ సామాజిక రీతులు మున్నగు సుగుణములను మనధ్యానముకు తెచ్చును. దయానందుడు సత్యార్థ ప్రకాశమున నిట్లు వ్రాసెను.

"యూరపియనులలో బాలవివాహములు లేవు. బాలబాలికలు సురక్షితులై యుందురు. స్వయంవర వివాహములు జరుగును. వారు విద్వాంసులై పాషండులవలలో జిక్కకొనరు. పరస్పరము విచారించి కార్యము లాచరింతురు. స్వజాత్యున్నతికొఱకు ధనము శరీరము మనస్సువ్యయింతురు. తనదేశపు చెప్పులను సైతము కార్యాలయములకు గొంపోవుదురు. చూచితిరా? ............... "నేటివఱకు తనదేశములందుపయోగించునట్లు మొద్దుగుడ్డల నుపయోగింతురు. తనదేశపు వర్తనలను రీతులను విడువరు. మీలో బహుమంది వారి ననుకరించిరి. అనుకరించుట బుద్ధిమంతుల కార్యముకాదు............ఇట్టి గుణములచే వారి యున్నతి జరుగుచున్నది."

మఱియొక సారగర్భిత వాక్యమున ఋషి యీదేశమున వైదేశిక రాజ్యమేర్పడుటకు కారణము నిట్లు వివరించుచున్నాడు.

"పారస్పరిక భేదభావము, బాలవివాహములు, స్వయంవర రహిత వివాహములు, ఇంద్రియ విషయలాలస, అసత్య వ్యవహారము, పాపాచరణము, వేదాధ్యయనమును త్యజించుట మఱియు నితర దుష్కర్మములు........"

ఋగ్వేదమంత్ర వ్యాఖ్యయందొకచోట నిట్లు వ్రాసియున్నాడు. "మనుష్యులు ఆత్మసమ్మాన యుక్తులు న్యాయపరాయణులు సత్యసంధులు నైనపుడు రాజ్యైశ్వర్యము ననుభవింప గలుగుదురు. దుష్టులునన్యాయవర్తనులు నయినపుడు వారి సర్వస్వము నశించును."

ఈవిషయమునే ౨౦౦౦ సం॥లకు పూర్వమొకయహూది ప్రవక్త చెప్పియుండెను. "సదాచారము జాతి నున్నత మొనర్చును" కాని యీ సుందర 'బైబిల్' శిక్షను క్రైస్తవజాతులు కాళ్లక్రింద నులిమి వైచినవి. మూడు శతాబ్దముల నుండి 'యూరప్; ఆర్యభావనారహిత విచారములచే బాధింపబడుచున్నది. ఈశ్వరుడొక్కడు - మనుష్యజాతియు నొక్కటే. పారస్పరిక సేవానియమము ఆర్యాదర్శము.

భారత లేఖకులలో దయానందుడే ఆర్యభాషను రాష్ట్రభాషగా జేయు భారము వహించువారలలో ప్రప్రథముడు. భారతీయ పరంపరాగత విషయములు ఆదర్శములు నెక్కువ

ఏవనియందు ప్రోత్సహింప బడినవి? అతడు భారతీయ పరిస్థితిని జూచెను. దాని పతనావస్థను గుర్తించెను. పునరుజ్జీవింప ననువగు నూత్నభావ నావశ్యకతను తెలిసికొనెను. భారతవర్ష మాత్మసంరక్షణ నియమమును భగ్నమొనర్చుటచే పతితమయ్యెనని యూహించెను. అతని యనుభవమున జాతికి శక్తిశాలియు ప్రగాఢమును, నగుజీవనమునకు తీవ్రప్రేరణ లభించుట యావశ్యకమనితోచెను. ఈజీవనప్రేరణ యార్యాదర్శముల నూత్నజ్ఞానముచే నూత్నబోధచే లభింపగలిగియుండెను. భారతము తనజాతీయాదర్శములను ప్రకటింపకున్న నెన్నడు మహత్త్వమును సంపాదింప నేరదని యతని దృఢవిశ్వాసమైయుండెను. ఆర్యధర్మము యొక్క నూతనపరిజ్ఞానము, నవీనప్రేమ-వీనిచే నవభారతము జన్మించును.

అందువలన నతడు భారత సంస్కర్తలను ధార్మికసంస్థలను జాతిసేవకొఱకొక సమానవేది నలంకరింపజేయ నభిలషించెను. అర్వాచీన భారతముయొక్క ఐక్యసమ్మేలనము (Unity Conference) ప్రప్రథమమున దయానందునిచే నొకయర్ధ శతాబ్దమునకు పూర్వము జరుపబడెను. మనదేశమున బహుమూల్యప్రయత్నాంతరము లెట్లు నిష్ఫలములయ్యెనో అట్లే యీ సమావేశమును నిష్ఫలమయ్యెను. కాని యిందులకు దయానందుని యసహిష్ణుత (Intolerance) కారణమని వాకొనుట యతడనేకమారులుచేసిన వాస్తవికైక్య సమ్మేలన ప్రయత్నమును విస్మరించినట్లగును. కేశవ చంద్రసేనుని ప్రభావముననడుచుచున్నఇండియన్ మిర్రర్ (Indian mirror) పత్రికయందు క్రీ. శ. ౧౮౭౭ సం॥న నిట్లు ప్రకటింపబడెను.

"వర్తమాన సంశోధకులలో నేకత సంపాదింపగోరి దయానందుని నివాసస్థానమున జరుగు సమ్మేలనము వ్యావహారిక వాస్తవికాధారముమీద ఏకత స్థాపింప గలుగునెడల దానిపరిణామ మత్యంతశుభావహమగుటలో సందేహములేదు". దయానందు డేకతను కోరి యనేకమారులు యత్నించెను. ఋగ్వేదమున శాంతిపూర్వకముగా నేకమగుటకు వ్యవస్థాపూర్వకముగా సహయోగ మొనర్చుటకు, ప్రేమసహానుభూతులతో విచారించుటకు, హృదయమున పారస్పరికప్రేమను స్థాపించుటకు, బుద్ధిని సర్వజనుల కల్యాణముకొఱ కుపయోగించుటకు నాదేశింపబడియున్నది. పారస్పరిక సహాయత, పారస్పరిక భద్రత దీనికి సంబంధించిన సిద్ధాన్తము లనేకవేదమంత్రములందు సుందరరూపమున వర్ణింపబడియున్నవి.

భేదభావముల మూలమున నిర్బలత స్థిరమైయున్నది, శక్తి వలననే యేకతయు స్వాధీనతయు లభించును. "శక్తి" సందేశము నవభారతమున కత్యావశ్యకము. దయానందుడు తన జీవితముననుశిక్షయందును శక్తి సందేశమునందు గభీర విశ్వాసమును ప్రకటించియున్నాడు. నేను సమర్థించు శక్తి సర్వతోముఖము. శరీరము - మనస్సు - ఆత్మ వీనిశక్తులను గుర్తించుచు దయానందుని జీవితము చదువదగియున్నది. దీనికి కారణ మతడొక శక్తిశీలి మనుష్యుడు. కౌపీనధారణ నొనరించు నాస్వామి శరీరమున బలవంతుడు. వేదభాష్యమున దయానందు డీశ్వరభక్తుల శరీరము దృఢముగా నుండు టావశ్యకమని వ్రాసియున్నాడు. శరీరము-ఆత్మ ఈ రెంటి శక్తులు విజృభించవలెను. మానసిక శక్తిని విద్యను వృద్ధి పొందించి

శరీరశక్తిని పెంపొందింపని యనేక విద్వాంసులను శరీరబల సంపన్నుడొక్కడే పరాజితులజేయునని దయానందుడొకచో వ్రాసియున్నాడు. అందువలన నుభయ వికాసమావశ్యకము. శరీరబలమును సంపాదించుట చరిత్రమును జాతినినిర్మించుట యని నా యభిప్రాయము. శారీరిక శక్తికి నేనాధ్యాత్మిక మూల్యమునిత్తును. జాతిసేవయందుత్సుకులగు పురుషులకు "శరీరమును శక్తిసంపన్న మొనర్చుడని చెప్పుదును. దయానందుని శారీరిక శక్తుల విషయములలో ననేక కథలు వినదగినవి. అతడొకనాడు (బనారసు) వారాణసి వెళ్లుచుండెను. వర్షమువలన మార్గము పంకమగ్నమై యుండెను. ఒకబండి బురదలో చిక్కుకొనెను. బండివాడు దానిని పైకి తీయన సమర్థుడయి నిర్దయతో నెద్దులను కొట్టుచుండెను. దయానందుడు ఆదీన జంతువులను రక్షింపనేగును. బండివాని నెద్దులను కొట్టకుండ నిషేధించును. తరువాత ఎద్దులను విడిచి స్వయముగా బండిని బురదనుండి పైకిలాగును. మఱియొక సమయమున నొక గుఱ్ఱపుబండిని వెనక పట్టుకొనును. గుఱ్ఱము బలముకొలది యత్నించియు ముందుకు సాగలేకపోవును. ఈ యర్వాచీన భారతమహర్షి నిస్సందేహముగా నొక కీర్తిగన్న మల్లుడయి యుండెను. సత్యమగు నాధ్యాత్మికత యన కోమల భావుకతగాదు.

దయానందుడు భారత వర్షము యొక్క నిర్భయశక్తి సంపన్న మనుష్యుడు. అతడొకచో తనకు పరమాత్మని నుండి తప్ప మఱి యెవరినుండియు భయములేదని వ్రాసెను. దయానందుడు గంగానదిలో స్నానము చేయుచుండ మకరమొండు

సమీపమునకు వచ్చెను. తీరమున నున్న మనుజుడు మొసలి మొసలియని కేకలుపెట్టెను. దయానందునకు భయముగాని తొందరపాటుగాని కలుగదు. అతడు శాంతిపూర్వకముగా "దీనికి నే నపకారము కలిగించనపుడు నాకిది యపకారము జేయనేరదు" అనును. ఒకనాడు శాస్త్రార్థము సమయమున కొందఱు దుష్టులు ఋషిపై నాక్రమణము చేయుదురు. అట నుండి దయానందుడు స్వస్థానమునకు తిరిగివచ్చెను. మరల నటకు దుష్టులరుదెంచిరి. వానిని మందలింపగోరి దయానందుని లేఖకుడు బయటకి రాగా నతనిని కొట్టిరి. అతనిని రక్షించుటకై ఋషి యొక దండమును చేతబట్టుకొని కుటీరము వెలుపలికి వచ్చి వారిని గద్దించును. తేజస్సంపన్నుడగు నతని యెదుట దుష్టులు నిలువజాలరైరి. వెంటనే కాలికి బుద్ధి చెప్పిరి.

అతనివార్తాలాపములు ఋజుత్వముతోగూడి యుండును. విరోధి సమూహములమధ్య నయిత మతనికితోచిన సత్యమును నిర్భయముగా ప్రకటించును. బలవంతులకు విరుద్ధమగు సత్యమును వారియెదుటనే చెప్పును. ఒకసభలో దేశీయ నరేశుడున్న సమయమున భాషించుచు "వేశ్యనుంచుకొను క్షత్రియ రాజు స్వయముగా వేశ్యజాతీయుడగును" అని చెప్పెను. రాజది విని "మీరు నన్నుగూడ విడువలేదే" అనెను. దయానందుడందులకు "నేనెవరి పక్షపాతముజేయక సత్యమును జెప్పుదును. ఇది నాధర్మము" అని నుడివెను. అతడొకింత కఠోరత వహించవలసి వచ్చినను సత్యవ్యవహార మొనరించెను. దీనిని నిర్బలసమాలోచకులు 'అసహిష్ణుత' యనిరి. దయానందుడంధవిశ్వాసము లందును కపటవర్తనము లందు నస

హిష్ణుడు. తత్కాల స్వకార్య నిర్వాహార్థమతడు సత్యమును విడనాడడు. అతడు శాంతముతో, వీరోచిత హర్షముతో కష్టములను సహించెను.

ఈ శక్తిశాలి మనుష్యుని హృదయములో దీనులగూర్చి కోమలప్రేమ నిండియున్నది. అతడు తన పితృసంపత్తిని విడనాడి దీన సోదరుల సంఘమున ప్రవేశించును. అతడు దృఢతతో విద్యాలయమున సంయమపాలన మొనర్చును. అనేక దినము లుపవసించును. ఇటుకలను తలదిండుగా నుపయోగించి కఠినభూమి తలమున సుఖనిద్ర ననుభవించును. కేవల కౌపీనధారియై భిన్నభిన్న ప్రాంతముల సంచరించును. రాజప్రాసాదములకంటె బీదల పర్ణశాలను ప్రేమించును. పతితులను దలితులను ప్రేమతో తనహృదయమున హత్తుకొనును. ఒక నీచజాతి మనుజుడొకనాడు శ్రద్ధతో నతనికి భోజనము తెచ్చును. దయానందుడా ప్రేమోపహారమును గ్రహించును. అట నాసమయమునందుపస్థితుడైయున్న యొక బ్రాహ్మణుడు దయానందునితో "నీవి మనుష్యునిచే తేబడిన భోజనమును గ్రహించితివి. అందువలన భ్రష్టుడవైతివి" అనెను. దయానందుడతనితో నిట్లనును" భోజనము రెండువిధముల భ్రష్టమగును. ఇతరులను కష్టపెట్టి సంపాదించినందువలన, చెడ్డపదార్థము కలిసియుండుటవలనను. ఈబీద మనుజుడు స్వేదమూడ్చి తనయాహారమును సంపాదించును. అందువలన నితనిభోజన మత్యుత్తమము" అతడు "జాతిభేదశూన్యుడగు నీశ్వరుని" ఘోషించును. తన సమాజమున, ననాథులను, జాతిపీడితులను, విధవలను, దుర్భిక్ష బాధితులను, దీనులను, చిన్నచిన్నజాతులకు సంబంధించినవారిని నెల్లరను చేర్చుకొనును.

నేడు మనతోబాటు దయానందుడు తనభౌతికశరీరముతో గూడియున్న భారతము నేభావములతో తిలకించును? ఒకప్పుడు ఆర్యావర్త నిర్మాతలయిన ఆశ్రమములను, పాఠశాలలను. దలితజాతులను, గ్రామీణులను, పీడితస్త్రీలను జూడుమనెను. అతడు తన సందేశము నొకసమాజమునకు మాత్రమిచ్చి యుండలేదు. సమస్తజాతికి ప్రసాదించియున్నాడు. ఈ సందేశము పురుషశక్తికి-బలమునకు సంబంధించినది. తన వేద భాష్యమున "మనుష్యుడు పరమేశ్వరుని సహాయమున ధర్మపూర్వకముగా-శరీరమును విద్యను ఆత్మబలమును పెంపుజేసి కొనవలెను". "మనుజుడు ఈశ్వరభక్తుడు బలవంతుడును కానంతవఱకునైశ్వర్యము ప్రాప్తించనేరదు" అనివ్రాసియున్నాడు. ఇది శక్తి సందేశము-ఆత్మసమర్పణ సందేశము. "ఆర్యావర్తమున యజ్ఞమాత్మ సమర్పణగా నెంచబడుచుండెడిది. పశువధతో యజ్ఞమున కెట్టిసంబంధము లేద"ని దయానందుడు నుడివెను. మనయందుగల పాశవిక వృత్తులను వధింపవలయును. దీనులకు దలితులకు సహయోగమొనర్ప యత్నింపవలయును. దయానందుడు భారత నవయువకులకు కర్తవ్యముగా నేర్పిన యజ్ఞమిదియే.

యువకులారా! జాతిసేవకులు కాదలతురేని నిరాడంబరులు బలవంతులు కండు. దీనులను సమీపించుడు. గ్రామీణుల చెంతజేరుడు. వారు-"ఆశా" 'విశ్వాసము'నను సందేశముల నపేక్షించుచున్నారు. శక్తి సందేశమును గొనిపొండు. ఈ జాతిలోగల యంధకారము నడంచుటకై ఆత్మ-శక్తి యను ప్రదీపమును వెంటతీసికొనుడు.

# కృష్ణుడు మురళీ నాదమొనర్చినచోటు

ఆర్యమార్గమును ప్రకాశింప జేయుటకై భగవానుడు దయానందునిచేతిలో నొక "ప్రదీప" మొసంగెను. ప్రాచీనార్యావర్తపుకాంతినాకు దయానందునిలో గనబడినట్లు తదితరులలో కనిపింపదు. దయానందు డార్యభారతమునకు ప్రకాశకుడు. భారతీయ భారతమునకు చిహ్నము. ప్రభాతమునకు దేవదూత. భవిష్యమున కగ్రసందేశహరుడు. అతని దేహాంతమయి 60 సం॥ కంటె నధికసమయమయ్యె. ఒకమాసమునకు తరువాత వేలసంఖ్యలో నతనిభక్తులు మధురలో నేకత్రితులుగానున్నారు. ఈ మధురలోనే ఋషికి విరజానందుడు లభించెను. ఈవైదిక యతి నివసించినగృహము నేటికి నిటనున్నది. ప్రాచీన-ఋషులిరువురు తపమొనరించి యీశ్వరోపాసన నొనరించిన యీ గృహమునార్యసామాజికులెన్నడు నూత్నమందిరరూపమున స్థిరమొనరింప యత్నింతురు. మధురలోనే ఋషి దయానందుడు నూత్నసందేశమును పొందెను.

మధుర-గోపాలకృష్ణుని పవిత్రభూమి-హిందువుల(వైదికుల) హృదయహారి. అతిశయప్రియకరము. మనుష్యసముదాయమీస్థానమున దయానంద మహర్షికి శ్రద్ధాంజలి నర్పించుటకై గుమికూడు చిత్రమును మనసున చిత్రించునపుడు నామనస్సు క్షణమాత్రకాలము దృశ్యాంతరము నాకర్షించును.

బుద్ధభగవానుడు సమాధిస్థుడైన గృధ్రకూట పర్వతగుహ అనేక శతాబ్దముల యనంతరమట కొకచైనా యాత్రికుడరుదెంచెను. అతడు కేవల పుష్పమాల నుపాయనముగా తీసికొనివచ్చెను. అతడాగుహను సమీపించుటతోడనే యతని హృదయము మానసిక భావములతోను నయనము లశ్రుజాలముతోను నిండిపోయెను.

నేను నొక యాత్రికుడను. హే ప్రాచీనాదర్శపూర్ణమహర్షీ! నేను ప్రేమాశ్రుపూర్ణ నేత్రములతో నీకు ప్రేమమాల నర్పింతును.

నేడు నీ దేశవాసులు నీ జన్మదినోత్సవమును, ఇతిహాస ప్రభాతమున తపస్వులు గాన మొనరించిన వైదికసూక్తపాఠములతో జరుపుచున్నారు.

నేడు నా హృదయారాధ్యదేవుడగు శ్రీకృష్ణుడు మురళిని నాదమొనరించిన్న కుంజములలో పక్షులుసైతము కలరవ మొనర్చుచున్నట్లు తోచుచున్నది.

దయానంద! నీవు మరణించలేదు. నీ విపుడొంటరివి గావు. ఈ నలువది వర్షాధికకాలమున పూర్వముకంటె మహావ్యక్తివైతివి. నీస్వప్నము బహుజనులహృదయమునచేరినది. నీసందేశము అనేకుల మనస్సులలో గుంజాయమానమగుచున్నది.

ఈ ప్రేమోత్సాహములతో నిండిన పూర్వదేశమున నీ నిజజాతికి సంబంధించిన భవిష్య విశ్వాసము అనేకమహాన్నతాత్మలలో నొకజ్వాలను ప్రజ్వలింపజేసినది.

నీవీ ప్రాచీనజాతికి ప్రోత్సాహము నిచ్చువాడవు.

నేను నిన్ను జూచుచున్నాను. హే పునరుజ్జీవిత భారత మహర్షీ! నేను నిన్ను నాస్వప్నములతో నాసంగీతములతో కలిపి దర్శించుచున్నాడ.

ఈ సంగీతము శక్తి సంపన్నమగు స్వాధీనార్యజాతిది. ఈ స్వప్నము దివ్యమానవులకు చెందినది.

ఓం శాంతిః

## శ్రీమద్దయానంద సరస్వతి

వేదవేదాంగాది విద్యలు నశియించి
పౌరాణభావంబు ప్రబలియుండి
మానవకుల భేద మత్సరగ్రస్తత
నస్పృశ్యతాభావ మావహించి
చచ్చినవారికి స్వర్గంబు గోరియు
పిండంబులను బ్రీతి బెట్టుచుండి
స్త్రీ శూద్రులను వారు స్థిరముగా వేదముల్
పఠియింప రాదంచు బ్రబలియుండి
దేవుడపుడప్డు దుష్టుల దీర్చుటకును
శిష్టులను వారి దాను రక్షించుటకును
నవతరించు నటంచును నజ్ఞులగుచు
తలచుచుండియు కష్టాల కలగుచుండ.
వేదమంత్రార్థముల్ విస్తరించియు జూపి
యందఱు జదువగా నర్హులనెను
పరమేశ్వరుండు దా బరగు నంతట నందు
చేత నాకారంబు చెల్లదనెను
సృష్టియుండెడు చోట సృష్టికర్తయు గూడ
నుండుట సర్వత్ర నుండు ననెను
ఆకృతి లేకుంట నాకలి దప్పులు
నాడులు పాపముల్ కూడవనెను
నిత్యశుద్ధుడు బుద్ధుడు నిత్యముక్తు
డైన భగవంతు డాకృతి నమరడనెను
సూక్ష్మమునకంటె సూక్ష్మమై సురిగియుండి
స్థూలమునకంటె స్థూలమై చొప్పడుననె.

— వెంకయార్య